"బ్రహ్మమొక్కటే" గ్రంథమాల

# మహారాష్ట్ర భక్తులు

రచయిత

**డా॥ ముదివేడు ప్రభాకరరావు**

ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2018**

**MAHARASHTRA BHAKTULU**

By

**DR. MUDIVEDU PRABHAKARA RAO**

T.T.D. Religious Publication Series No: 1342



*First Edition : 2018*

*Copies : 500*

*Published by :*

**Sri ANIL KUMAR SINGHAL**, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

***D.T.P:***
Publications Division,
T.T.D, Tirupati.

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati.

# ముందుమాట

**రామభక్తిసామ్రాజ్య మే – మానవుల కబ్బెనో మనసా ।**
**ఆ మానవుల సందర్శన – మత్యంత బ్రహ్మానందమే ॥**

**– సద్గురు శ్రీత్యాగరాజస్వామి**

"హృదయంలో 'రామభక్తి సామ్రాజ్యనిర్మాణం' చేసుకొన్న అదృష్టం ఏ మానవులకు అబ్బినదో కదా! అటువంటి మహాభాగవతుల, మహాపురుషుల సందర్శనం వర్ణించడానికి వీలులేని బ్రహ్మానందాన్ని కల్గిస్తుంది కదా!" అంటారు త్యాగయ్యగారు. త్యాగయ్యకాలానికి ఆయన చేసిన సమన్వయం చాలగొప్పది. అన్నమయ్య, పోతన్నలవలె త్యాగయ్య కూడ పుట్టుకతో స్మార్తుడు, అద్వైతి, శివభక్తుడు. వీరు ముగ్గురు శ్రీవైష్ణవ సంప్రదాయానుసారంగా దశావతారాలను నోరార స్తుతిస్తూ, వాటిని అద్వైత ముఖంగా వ్యాఖ్యానించారు.

త్యాగయ్య భక్తి సామ్రాజ్యం ఆంతర నిర్మాణాన్ని గూర్చి చెబితే, బాహ్య ప్రపంచంలో దాని ఉనికిని ప్రత్యక్షీకరింప జేసినదే భక్తి ఉద్యమం (Bhakti Movement) భారతదేశంలో భక్తి ఉద్యమం మధ్యయుగాలలో అంటే క్రీ.శ. 1250–1850 మధ్య కాలంలో వెలసింది. ఇది భారతీయ సామాజిక, తాత్త్విక, ఆధ్యాత్మిక చరిత్రను ఒక గొప్ప మలుపు (A Turning Point) తిప్పింది. భక్తి ఉద్యమమే రాకపోయి ఉంటే భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చేది కాదేమో! భిన్నత్వంలో ఏకత్వం (Unity in Diversity) జాతీయ సమైక్యత (National Integration) అనే రెండు మహావిషయాలను సాధించిన ఘనత భక్తి ఉద్యమానికే చెల్లుతుంది. ఇది 600 సంవత్సరాలు నడిచి భారతీయ సాంస్కృతిక చైతన్యానికి గట్టి పునాదులు వేసింది. దీన్ని నేపథ్యంగా స్వీకరించే మహాత్మాగాంధీ స్వాతంత్ర్య సముపార్జన చేశారు.

మహారాష్ట్రంలో భక్తి ఉద్యమం మూడు పువ్వులు ఆరు కాయలుగా విస్తరించింది. సాధ్వి బహినాబాయి (క్రీ.శ.17వశతాబ్ది) వ్రాసిన అభంగాలలో భక్తి ఉద్యమమనే దేవాలయ నిర్మాణానికి అత్యంత దోహదం చేసిన

మహానుభావులు. 'భాగవతులు, సంత్‌సాధువులను సంస్మరిస్తూ ఇలా వ్రాసింది.'

"**శ్రీసంత్‌సాధువుల** దయాదృష్టులనే మేఘాలు కురిసిన అమృతవృష్టి! **భక్తి ఉద్యమమనే** మహాదేవాలయ నిర్మాణం సంపూర్తి కావచ్చింది. **జ్ఞానదేవుడు** పునాదిరాయిగా సజీవసమాధి అయినాడు. గుడి నిలబెట్టాడు. **నామదేవుడు,** జ్ఞానేశ్వరుని శిష్యుడు, నాల్గువైపులా ప్రాకారమై పొదువుకున్నాడు. **ఏకనాథుడు** జనార్దనుని శిష్యుడు, భాగవత వ్యాఖ్యానస్తంభం పాతాడు. **తుకారాముడు** ఆ దేవాలయ గోపురశిఖరమే అయ్యాడు. ఇప్పుడిక మీరు తీరుబాటుగా ప్రవేశించండి దేవాలయాన్ని! గుడిలోపల జరిగే అభిషేకార్చనలు తిలకించండి, రంగని సేవించండి. అదిగో..! అదిగదిగో...! మన బహినాబాయి – ధ్వజస్తంభంపై ఎగరేసిన గరుడుని గంభీరపటం పటపట శబ్దిస్తుండగా ఆకాశవీథిలో హాయిగా సాచిన రెక్కలతో 'హంస'లా విహరిస్తూ అందరినీ వేవేగ రమ్మని రెక్కల చేతులతో ఆహ్వానిస్తున్నది."

ఈ 'అభంగం' మహారాష్ట్ర దేశంలో భక్తి ఉద్యమానికెత్తిన విజయ వైజయంతిక! ఇలా ఈ 'చిన్నిపొత్తం'లో శృంగగ్రాహికగా కొందరు భక్తి ఉద్యమకారులై ఆధ్యాత్మిక చైతన్యంతోపాటు సామాజిక చైతన్యాన్ని కలిగించిన మహామనీషుల జీవితగాథలను **"బ్రహ్మమొక్కటే"** గ్రంథమాలలో ఒకటిగా సరళమైన శైలిలో వ్రాసి అందించిన రచయిత డా॥ముదివేడు ప్రభాకరరావును మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. ఈ గ్రంథాన్ని చదివి పాఠకులు ఉత్తేజితులై ధర్మమార్గంలో పయనిస్తారని ఆశిస్తున్నాను. 'ధర్మోరక్షతి రక్షితః'

*సదా శ్రీవారి సేవలో....*



కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు,

తిరుపతి.

## విషయాను క్రమణిక

# మహారాష్ట్ర భక్తులు

## 1. వీసోబా

పండరీపురంలో వీసోబా అనే గొప్ప వర్తకుడుండేవాడు. ఎప్పుడూ తన వ్యాపారాభివృద్ధి మీదనే దృష్టితో జీవించే వీసోబాను ప్రజలు ఆగర్భశ్రీమంతుడని పిలిచేవారు. అతడికి తనకున్న అపారధనరాశిని లెక్కించి పెట్టుకోగల అవకాశమే దొరికేది కాదు. ఈ వెసులుబాటులేనితనం ఎంతదూరం వెళ్లిందంటే అతడు తనకు ఇతరులనుండి రావలసిన సొమ్మును కూడ, లెక్కపెట్టి తీసుకోవడానికి సమయం చాలక, తూకంవేసి తీసుకొనేవాడు. తాను ఇతరుల కివ్వవలసి ఉన్నా తూకంవేసే ఇచ్చేవాడు.

ఎంతగొప్ప ధనవంతుడైనప్పటికీ గర్వమనేది ఏకోశానా లేని నిరాడంబరుడు వీసోబా. సామాన్యంగా ఐశ్వర్యవంతులకుండే పరదూషణ, వేళాకోళం, వెఱ్ఱివేషాలు, అట్టహాస ఆర్భాటాలు లేకుండా, గుట్టుచప్పుడు కాకుండా తన కుటుంబ జీవనాన్ని సాత్త్విక మార్గంలో నడుపుకొనేవాడు. ముఖ్యంగా, ఐహిక సుఖాలపట్ల విలాసవంతమైన జీవనంపట్ల ఆసక్తిలేనివాడు వీసోబా. 'సాధుజీవనం – నిరంతర భగవచ్చింతన' ఆయన జీవన విధానం!

ఆయన చేసుకొన్న పూర్వజన్మ అదృష్ట విశేషంచేత సుగుణాలరాశియైన ధర్మపత్ని లభించింది. ఆ దంపతులకు నల్గురు కుమారులు. తల్లి – తండ్రీ శుద్ధసాత్త్వికులు కావడంచేత పిల్లలు కూడ అటువంటి స్వభావమేగల వారయ్యారు. ఇలాంటి భార్యాపుత్రులతోడి వీసోబా సంసారజీవితం, నల్లేరుపై బండినడకలా ప్రశాంతంగా గడవసాగింది.

లోకం విచిత్రమైంది. గుట్టుగా, గోప్యంగా సంసారజీవితాన్ని గడిపే విసోబాను చాటుమాటుగా వేళాకోళం చేసేవారు ఇరుగుపొరుగు వారు. అంగట్లో అన్నీ ఉన్నాయి – అల్లుడి నోట్లో శనివుంది" అన్నట్లుగా ఉంది వీసోబా జీవితం అనికొందరు, "దరిద్రుడి కెంత ధనం కలిసొచ్చినా

పిసినారితనంతోనే ప్రవర్తిస్తాడు" అని కొందరు, 'నదిలో నీళ్లు సమృద్ధిగా పారుతున్నా కుక్క నాలుకతోనే గతుకుతుంది' అని దెప్పిపొడిచేవారు. అవన్నీ వీసోబా పట్టించుకొనేవాడు కాడు. "లక్షాధికారైన లవణమన్నమెగాని మెఱుగు బంగారంబు మ్రింగబోడు" అందుచే, "కాలమొక్కరీతి గడుపవలయు" అని తలపోసేవాడు. "మూన్నాళ్ల ముచ్చటకోసం విఱ్ఱవీగడం ఎందుకు? జీవితం అస్థిరం, మంచితనమే శాశ్వతం" అని భావించేవాడు.

## 2

పండరీపురానికి వచ్చే భక్తులందరూ ఆ పుణ్యక్షేత్రంలోని అన్నసత్రాలలో దిగి, తీర్థయాత్ర ముగిసేవరకు ఉండి వెళ్లేవారు. ఇలా ఎందరో ధనికులు అన్నసత్రాలు ఏర్పాటుచేసి ఉండగా వీసోబా కూడా విఠోబా భక్తులకు అహోరాత్రాలు తన ఇంట్లో అన్నదానం చేసేవాడు. ఇంకా ఎక్కువమంది భక్తులురావడం లేదని బాధపడేవాడు. వచ్చీపోయే భక్తులకు ఉపచరించడంతోనే ఆయనకు పొద్దుపోయేది.

ఇదిలా ఉండగా, మహారాష్ట్రంలో మహాక్షామం ఏర్పడింది. పండరీపురానికి కూడ క్షామ బాధ తప్పలేదు. పుణ్యక్షేత్రంలోని బీదాబిక్కీ అన్న సత్రాలను ఆశ్రయించారు. విభిన్న ప్రాంతాలనుండి వచ్చే భక్తులు యథావిధిగా అన్నసత్రాలనే ఆశ్రయించారు. క్షామం కావడంవల్ల, భక్తులరద్దీ పెరిగింది. అన్నసత్రాలు కొన్ని రోజుల్లోనే మూతబడ్డాయి. 'అన్నమో రామచంద్రా!" అనీ 'అలో లక్ష్మణా!' అని భక్తులు ఆకలిబాధలకు విఠోబా ఆలయం ముందు ఆర్తనాదాలు చేయసాగారు. 'కుయ్యో! మొఱ్ఱో! యని కూపెడుతున్న ఆపన్నులు, విపన్నుల ఆర్తనాదాలు విన్న వీసోబా వెంటనే ఒక నిర్ణయం తీసుకున్నాడు. వీసోబా ధనవిషయంలో జాగ్రత్తపరుడేగాని పిసినారికాడు. ఆయన హృదయ వైశాల్యమెంతటిదంటే, తనకున్న ధనరాశులనంతా క్షామపీడితులకు పంచిపెట్టాలని ఉద్యుక్తుడయ్యాడు. ఆయన భార్యబిడ్డలుకూడ వీసోబా నిర్ణయానికి హర్షించారు. తోడ్పడ్డారు.



## 3

ఆకాలంలో ఇప్పటి మాదిరిగా కరెన్సీనోట్లు చెలామణీలో లేవు. పైగా సమయాభావంచేత వీసోబా ధనరాశుల్లో బంగారు, వెండి, రాగినాణాలు వేర్వేరుగా వింగడింపులేక, లెక్కలేనన్ని గోతాలలో కలగాపులగంగా వేసికుట్టబడి ఉండేవి. అవి బియ్యపు బస్తాలలాగా ఇంటిలో గోడలకు పేర్చబడి ఉన్నాయి. వ్యాపారం చేసేరోజుల్లో తూకంవేసి ఎలా తీసుకున్నాడో అలాగే గోతాలలోవేసి కుట్టబడి ఉన్నాయి. ఆ ధనరాశి కిప్పుడు సార్థకత చేకూరబోతున్నది.

క్షామం రాకముందైతే ఎవరైనా యాచకుడు వస్తే **"కాయ్ పాహిజే తుమ్హాలా?" (ఏం కావాలి మీకు?)** అని అడిగి వారికి ఏదికావాలో అది దానం చేసేవాడు. అదే, క్షామం ఏర్పడ్డాక ఆ ప్రశ్నతో పనిలేదు. అందరూ యాచకులే. మొదట తిండిగింజల సమస్య తీర్చాలని, ఇంట్లో ఉన్న ధాన్యరాశులను దానం చేయడం ప్రారంభించి అవిశ్రాంతంగా నెలరోజుల్లో బియ్యపు బస్తాలన్నీ దానం చేసేశాడు. అయినా క్షామం పూర్తిగా నివారణ కాలేదు. అది విఠోబా, వీసోబాకు పెట్టిన విషమ పరీక్షగా కనబడసాగింది. మరోవైపు ఆయన మిత్రులైనారు "తన్ను మాలిన ధర్మము - మొదలు చెడ్డ బేరము" అనీ, "ఊరికి ఉపకారి - ఇంటికి అపకారి" అని హేళన చేయసాగారు. దానికి వీసోబా ఏమాత్రమూ చలించక **"దానే దానే పర్ లిఖాహై ఖానే వాలే కా నామ్"** అన్నాడు. **(గింజ, గింజమీద తినేవాడి పేరు వ్రాయబడి ఉంది)** అది ఎవరికి చెందాలో వారికే చెందుతుంది. నాకు దానితో సంబంధంలేదు అన్నాడు. విజ్ఞులు 'వీసోబా'ను **'నిష్కామకర్మయోగి'** అన్నారు.

## 4

ధాన్యరాశుల దానం తర్వాత ధనరాశుల్ని దానం చేయడం ప్రారంభించాడు వీసోబా. నాణేల గోతాలను నలుగురు కుమారులు

మోసుకువచ్చి ఇంటికొరడు (ముంగిటి)లో నిలబెట్టిన తర్వాత ఆయన భార్య వాటికి కుట్టిన దారాలు విప్పేది. జోలెపట్టిన యాచకునికి దోసిళ్లతో బంగారు, వెండి, రాగి నాణాల కలబోతగా ఒక్కసారి పోసేవాడు వీసోబా! అలా ప్రతి యాచకునికి రెండు చేతులతో మూడు విధాలైన నాణాలను పోయడంవల్ల ఎవరి అదృష్టాన్నిబట్టి వారికి ఆయా నాణాలు లభించేవి! వీటిలో బంగారమెన్ని? వెండి ఎన్ని? రాగివి ఎన్ని? అనేవి వారు వారు లెక్కపెట్టి తెలుసుకోవలసిందే!

యాచకులలో కాశీనుండి పండరిపురానికి వచ్చిన ఒక వృద్ధపండిత భిక్షువు, ఉండబట్టలేక, విసోబాతో **"స్వామీ! క్యోం ఇస్ ప్రకార్‌దాన్ దే రహేహై?"** (ఎందుకు ఈ విధంగా బంగారు, వెండి, రాగి నాణాలను కలబోసి దానం చేస్తున్నారు) అని అడిగాడు. దానికి వీసోబా సమాధానం ఇలా ఉంది. **"వితోబానే ముఝే కిస్ ప్రకార్ దియా, ఉసీ హీ ప్రకార్ మై దే రహాహూ! పండిత్ జీ! ఆప్ కో వితోబాసే గాయా గయా, గీతాగాన్‌మే 'గుణత్రయ విభాగ్ యోగ్ 'అచ్ఛేసే మాలుమ్ హైనా? తో సమఝ్ లీజియే ఇస్ దాన్ కా అంతరార్థ్!"** (వితోబా నాకు ఏ ప్రకారంగా ఇచ్చాడో, అదే ప్రకారంగా నేను ఇస్తున్నాను. పంతులుగారూ! తమకు పాండురంగ విట్ఠలుడు పాడిన గీతాగానంలో **'గుణత్రయ విభాగయోగం'** చక్కగా తెలుసుకదా! భగవంతుడు వారి వారి గుణ, కర్మలను బట్టి ఫలిత మనుగ్రహిస్తాడు. సత్త్వ, రజస్, తమో గుణాలే ఈ బంగారు, వెండి, రాగినాణాలుగా నేను భావించాను) అన్నాడు. దానికి ఆ పండితుడు ఆశ్చర్యచకితుడై **"అహో! మహోబా!** అని గొంతెత్తి గట్టిగా చెప్పగా, ఆయన వెనక నిల్చిన యాచకులందరూ ఆ మాటనే భిక్షగ్రహించిన వెంటనే గట్టిగా చెబుతూ వెళ్లసాగారు. **"ఆశ్చర్యకరమైన మహానుభావుడివయ్యా!"** అనే అర్థంగల ఆ ప్రశంసా వాక్యాన్ని బట్టి **'వీసోబా'** అప్పటినుండి **'మహోబా'** (మహానుభావుడు)గా పిలువబడ్డాడు. 'మహా+అనుభావుడు' అంటే 'మహత్', మహాన్ శబ్దవాచ్యుడైన భగవంతుని సంపూర్ణ వైభవాన్ని అర్థంచేసుకొని అనుభవించగల ఉదాత్త పురుషుడని అర్థం. ఇది అంతర్ముఖీనత్వం గల మహాభక్తుని రసానందసాంద్రస్థితి!



మహారాష్ట్రలో మధ్యయుగీన కాలంలో వెలసిన భక్తి ఉద్యమాలలో రెండవదైన **'మహానుభావపంథ'** (క్రీ.శ. 12,13శతాబ్దాలు)కు చెందినవాడే 'వీసోబా' అనే పాండురంగ విట్ఠలుని మహాభక్తుడు. ఇతని నిత్యపారాయణ గ్రంథం **"భగవద్గీత"**

## 5

'తగిలిన కాళ్లకే దెబ్బలు తగులుతాయి' అంటారు పెద్దలు. తన సర్వస్వమూ దానంచేసి, భార్యాబిడ్డలతో, కట్టుబట్టలతో అత్యంత స్వల్పకాలంలోనే దరిద్రుడై నిలబడ్డాడు వీసోబా! **ఆయన అప్పటి పరిస్థితి చూస్తే, వామనుడడిగిన మూడడుగులు మూడులోకాలని తెలిసి కూడా దానమిచ్చి దరిద్రుడైన బలిచక్రవర్తిలాగా, విశ్వజిద్యాగంచేసి భూమినీ, సంపదలను దానంచేసి చేతిలో చిల్లిగవ్వలేని రఘుమహారాజును తలపింపసాగాడు.**

'గోరుచుట్టుపై రోకటిపోటు'లాగా ఒకరోజు హఠాత్తుగా పిడుగులాంటి వార్త విన్నాడు వీసోబా! క్షామం రాకముందు వీసోబా కుటుంబ సభ్యులతో కాశీయాత్రకు వెళ్లాడు. తీసుకుపోయిన సొమ్ము దానధర్మాలవల్ల ఖర్చయిపోగా, ఒక తురుష్క మిత్రుని వద్ద అప్పుగా కొంతసొమ్ము తీసికొన్నాడు. కాశీయాత్ర పూర్తి చేసుకొని పుండరీపురం వచ్చాకనే క్షామం ఏర్పడింది. వీసోబా తన సర్వస్వాన్ని దానం చేసేశాడు. ఇప్పుడు చేతిలో చిల్లిగవ్వలేదు. కాశీలో అప్పిచ్చిన వాడు మనిషిని పంపాడు. వచ్చిన వ్యక్తితో ఎనిమిదిరోజుల్లో మొత్తం డబ్బు వడ్డీతోసహా చెల్లిస్తానని చెప్పి పంపాడు. కాని, అతడు స్థానికులైన కొందరు వర్తకులు నీవు మాట నిలబెట్టుకొంటావని హామీ ఇస్తే తప్ప వెళ్లనన్నాడు. ఆవిధంగా కొందరు వర్తకులు భరోసా ఇచ్చాకనే అతడు వెళ్లాడు. రోజులు

గడచిపోతున్నాయి. వీసోబాలో ఆందోళన మొదలైంది. ఎట్లోకదే ఈశ్వరా!" అని కంటికి కునుకులేక జాగరణ చేశాడు వీసోబా!

పండరీపురంలో విజ్ఞులైన కొందరు పెద్దలు, **"వీసోబాకు ఎందుకీ విషమపరీక్ష! త్రిలోకాలను దానంచేసిన తర్వాత కూడ బలిచక్రవర్తిని విష్ణువు వరుణపాశాలతో బంధించినట్లు ఉంది ఈయన పరిస్థితి"** అని వాపోయారు. ఇంత నిష్కరుణ పనికిరాదు. బలికి పాశబంధచ్ఛేదం చేయుమని బ్రహ్మాది దేవతలు విష్ణువును వేడుకొన్నట్లుగా, ఊరి ప్రజలు పాండురంగ విట్ఠలుని వద్ద మొఱపెట్టుకొన్నారు.

పండరీపురంలో వెలసిన పాండురంగ విట్ఠలుని మనస్సు కరిగింది. కాశీక్షేత్రంలోని ఆ తురుష్కమిత్రుని ఇంటికి వీసోబా పంపిన పరిచారకుడుగా వెళ్లాడు స్వామి. తనను ఫలానా అని పరిచయం చేసికొని అతని కివ్వవలసిన సొమ్మును వడ్డీతో సహాచెల్లించి, డబ్బు ముట్టినట్లు రసీదు పుచ్చుకొని తిరిగివచ్చి, వీసోబా రోజూ పారాయణంచేసే భగవద్గీతలో రసీదును పెట్టాడు. మరునాడు పారాయణంకోసం పుస్తకం తెరువగా రసీదు కన్పడింది, ఆయనకు! రసీదు ఉన్న పుటలో ప్రధానశ్లోకమిది –

**శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥**

**– రాజవిద్యారాజగుహ్యయోగం – గీత (9-22)**

(దేవతాంతర భజనం చేయక, ఎల్లప్పుడూ నిష్ఠతో నన్ను తమవానిగా భావిస్తూ సదా యోగయుక్తులై నన్నే ఉపాసించేవారి యోగము, క్షేమముల భారాన్ని నేను వహిస్తుంటాను)

శ్లోకాన్ని చదివి ఆశ్చర్యంతో ఆనందబాష్పాలు రాల్చాడు వీసోబా! విఠోబా నన్నీవిధంగా ఋణబంధ విముక్తుణ్ణి చేశాడు! ఆయన తప్ప నాకీ సాయం చేసే వారెవ్వరు? అని మనస్సులోనే సాష్టాంగ నమస్కారం చేశాడు.



పండరీపురంలోని ప్రజలందరికీ ఈ అద్భుత వార్త తెలిసింది. వారందరూ వీసోబా మహానుభావుడే కాదు! మహాభక్తుడు కూడ! అని ప్రశంసించారు. వెంటనే విట్ఠలుడు సాక్షాత్కరించి "పరమ భాగవతా! సకల కర్మలనుండి నీకు విముక్తి కల్గింది. నన్ను చేరుకొందువుగాని రమ్మని" పిలిచాడు.

"స్వామీ! ఎంతదయ! ఎంతకరుణ! బడుగు జీవునిమీద!" అని అశ్రుపూరిత నయనాలతో వినయంగా వంగిపోయాడు. అప్పుడు స్వామి, "నీ భార్యాబిడ్డల చింతనీకు అక్కరలేదు. నీవు పట్టిందల్లా బంగారం చేశావు అలాగే వారూ అమోఘంగా ఉంటారు." అంటూ ఉండగా వీసోబా జీవుడు దీపంగా ప్రకాశిస్తూ స్వామిలో లీనమైంది. ఈ దృశ్యాన్ని చూచిన పండరీపురంలోని భక్తులు ధన్యజీవులు!

### ఫలశ్రుతి

**మ॥ క్రతుదానోగ్ర తపస్సమాధి జపసత్కర్మాగ్నిహోత్రాఖిల**
**వ్రత చర్యాదుల నాదరింప వఖిల వ్యాపార పారాయణ**
**స్థితి నొప్పారెడి నీ పదాబ్జ యుగళీ సేవాభి పూజా సమ**
**ర్పిత ధర్మం దగువాని భంగి నసురారీ! దేవ చూడామణీ!!**

**– పోతన భాగవతము (విదురమైత్రేయ సంవాదం) (స్కంధం-3, పద్యం-301)**

"రాక్షసవైరీ! దేవగణ శిరోభూషణమా! శ్రీహరీ! మనస్సును పూర్తిగా నీ పాదపద్మయుగళిపై ఉంచి సకలకార్యాలు నీ సేవగానే భావించే భక్తుని ఆదరించినట్లుగా, యాగాలు, తీవ్రతపస్సులు, సమాధ్యవస్థలు, జపాలు, కర్మకాండలు, అగ్నికార్యాలు, రకరకాల వ్రతాలు చేసేవారిని నీవు ఆదరింపవు కదా!

* * *

# 2. సంత్ నామదేవ్

## (క్రీ.శ. 1220-1350)

జ్ఞానేశ్వరుల సమకాలికుడు, శిష్యుడు అయిన సంత్ నామదేవ్ (క్రీ.శ.1220-1350) బాల్యకాలం నుండి పాండురంగ విట్ఠలునిపై మిక్కిలి భక్తివిశ్వాసాలు గలవాడు. ఇతడు గుడ్డలు కుట్టే **శింపి** కులానికి చెందినవాడు. ఇతని తండ్రిపేరు దమశేతి. భక్తికే అత్యంత ప్రాధాన్యమిచ్చినప్పటికీ, నామదేవుని రచనల్లో అసాధారణమైన తత్త్వావగాహన కనపడుతుంది. జ్ఞానేశ్వరునితో కలసి నామదేవ్ తీర్థయాత్రలకు ఉత్తర భారతదేశమంతా పర్యటించాడు. ఆ సందర్భంలో వ్రాసిన గ్రంథమే **తీర్థావళి.** నామదేవుని **ఆది తీర్థావళివ సమాధి** (ఆది తీర్థావళి మరియు సమాధి) అనే గ్రంథం జ్ఞానేశ్వరుని జీవితాన్ని తనయొక్క జీవితాన్ని కూడ చిత్రీకరించిన ఆత్మకథాత్మక పద్ధతి రచన. నామదేవుడు **'కీర్తన' సంప్రదాయాన్ని** వార్కరీ లేదా భక్తి ఉద్యమంలో ప్రవేశపెట్టాడు. ఇతడు స్వయంగా గుజరాత్, పంజాబ్ ఇంకా ఉత్తర భూభాగాలలో విస్తృత పర్యటన చేస్తూ మహారాష్ట్ర భక్తి ఉద్యమాన్ని ప్రచారం చేశాడు. ఈ ప్రయోజనాన్ని ఉద్దేశించే ఆయన హిందీ భాషలోను, గురుముఖి పంజాబీలోను కీర్తనలు వ్రాశాడు. నామదేవ్ వ్రాసిన అనేక కీర్తనల్లో నూటికి పైగా కీర్తనలు **"గురుగ్రంథ సాహెబ్"**లో, **"నామదేవుల ముఖవాణి"** (నామదేవ్‌కీ ముఖ్ బాణీ) అనేపేరుతో సంకలనం చేయబడి ఉన్నాయి.

ఎందరో పరిశోధక పండితులు నామదేవ్ యొక్క కీర్తి ప్రతిష్ఠలకు ప్రత్యేక కారణం, అతడు మహారాష్ట్రేతర ప్రాంతాలలో మహారాష్ట్ర భక్తి ఉద్యమ ప్రచారాన్ని ముమ్మరంగా కొనసాగించి ఉండడమే అన్నారు.

నామదేవుడు అసంఖ్యాకమైన **'అభంగాలు'** చెప్పాడు. ఇతడు తన సుదీర్ఘజీవితకాలంలో శతకోటి అభంగాలు చెబుతానని పాండురంగనికి



వాగ్దానం చేశాడు. ఆ సంఖ్యపూర్తి చేయలేకపోయాడు. కాని, మరుసటి జన్మలో సంత్‌తుకారాంగా పుట్టి శతకోటి, పూర్తిచేశాడని భక్తి సంప్రదాయజ్ఞుల విశ్వాసం! తుకారాం స్వప్నంలో నామదేవుడు, పాండురంగడు సాక్షాత్కరించి శతకోటిసంఖ్యను పూరింపజేశారని ఐతిహ్యముంది. ఇతని అభంగాలలో భగవంతుని చేరుకోవాలనే గాఢమైన ఆర్తి, తపన, ఆర్ద్రత, భక్తిభావోద్విగ్నమైన ఆధ్యాత్మికానుభూతితో రంగరింపబడినాయి. ఈయన జనాబాయికి గురువు, ఛోకామీళుని తీర్చిదిద్దినవాడు నామదేవుడే. గోరాకుంభారాకు ఇతడు సమకాలికుడు.

* * *

# 3. జ్ఞానదేవుడు

## (క్రీ.శ.1275-1296)

మహాత్ముల జీవిత చరిత్రల్ని ఒకసారి పరిశీలిస్తే, వారంతా తమ అత్యల్ప జీవితకాలంలో అపూర్వమైన ఘనకార్యాలు సాధించి, చరిత్రలో తమపేరును చిరస్థాయిగా నిలుపుకొని అఖండ కీర్తిప్రతిష్ఠలు ఆర్జించినవారు కావడం అద్భుతాశ్చర్యాలను కల్గిస్తుంది. ఉదాహరణకు - శ్రీశంకర భగవత్పాదులవారు క్రీ.శ.788లో జన్మించి 820లో నిర్యాణం చెందారు. వారి జీవితకాలం 32 సంవత్సరాలే. శ్రీచైతన్య మహాప్రభువు క్రీ.శ.1485లో పుట్టి 1533లో కృష్ణునిలో లీనమయ్యారు. వారి జీవితకాలం 48 సంవత్సరాలే! శ్రీరామకృష్ణపరమహంస శిష్యాగ్రేసరులైన శ్రీస్వామి వివేకానంద క్రీ.శ.1863లో జన్మించి 1902లో సాయుజ్యాన్ని పొందారు. వారి జీవితకాలం 39 సంవత్సరాలు మాత్రమే! వీరందరికంటే అతి తక్కువకాలం అంటే క్రీ.శ.1275లో జన్మించి 1296లో సమాధిపొందిన జ్ఞానేశ్వరులు జీవించినది 21 సంవత్సరాలే!

"ఎంత సుదీర్ఘకాలం జీవించినావనేది ముఖ్యం కాదు, జీవించింది తక్కువకాలమే అయినా, ఎంత గొప్పగా రాణించి సమాజానికి సేవ చేశావన్నదే ముఖ్యం! "అన్నాడొక సామాజిక తత్త్వవేత్త! నిజానికి అల్పకాలమే జీవించినా జ్ఞానేశ్వరులు భక్తి ఉద్యమానికి ఇతోధిక దోహదం చేయడమే కాదు, ఆ ఉద్యమాన్ని కేవలం భౌతిక స్వాతంత్ర్య దశకే పరిమితం కానివ్వకుండా, ఒక అపూర్వ ఆధ్యాత్మిక చైతన్య స్ఫూర్తితో నింపి ఆత్మ స్వాతంత్ర్యానికో 'దిశా నిర్దేశం' చేసి, మహారాష్ట్ర ప్రజల్ని ఉఱ్ఱూత లూగించిన మహానుభావుడైన భాగవతుడు, జ్ఞానేశ్వరుడు.

### పుట్టుపూర్వోత్తరాలు

జ్ఞానేశ్వరుని పూర్వులు 'పైఠణ్' గ్రామానికి (దక్కన్ లోని ఔరంగాబాద్ జిల్లాలో ఉండే ఒక ప్రసిద్ధ పుణ్యక్షేత్రం దీనినే **'దక్షిణ కాశి'** అని పిలుస్తారు.)



నాలుగు క్రోసుల దూరంలో గోదావరీ నదీతీరంలో గల 'ఆపేగాంవ్ వాస్తవ్యులు.' వీరి పూర్వీకులు కరణీకం చేస్తుండేవారు. సంప్రదాయపరంగా చూస్తే వీరు మాధ్యందినశాఖకు చెందిన యజుర్వేదీయ బ్రాహ్మణులు.

### జననం

శ్రీజ్ఞానేశ్వరులు శాలివాహన శకం 1197 (1197+78=) క్రీ.శ. 1275లో శ్రావణమాసం, కృష్ణాష్టమినాడు 'శ్రీక్షేత్ర ఆళంది'లో జన్మించారు. రఖుమాబాయి (రుక్మిణీబాయి), విఠల్ పంత్ వీరి తల్లితండ్రులు. నీరాబాయి, గోవిందపంత్‌లు వీరి అవ్వతాతలు. ఈయన శుక్ల యజుర్వేదీయ దేశస్థ బ్రాహ్మణుడు. గోవిందపంత్ దంపతులు గహనీనాథుని అనుగ్రహాన్ని పొందినవారు. జ్ఞానేశుని తల్లి వంశంకూడా, సదాచార సంపన్నమైనదే. శ్రీక్షేత్ర ఆళంది వాస్తవ్యులు. రుక్మిణీబాయి తండ్రి సిద్ధేశ్వరకులకర్ణి. వంశపారంపర్య కరణీకం, కులవృత్తిగా గల్గినవారు కాబట్టి, 'కులకరణి' లేదా కులకర్ణి అనే రూఢి, ఏర్పడింది.

గోవిందపంత్ కుమారుడు విఠల్ పంత్ యువకుడుగా ఉండేటప్పుడే తీర్థయాత్రలనెపంతో దేశాటనం చేస్తూ ఉండేవాడు. అలా తీర్థయాత్ర నిమిత్తంగా శ్రీక్షేత్ర ఆళందికి వచ్చినప్పుడు అనుకోకుండా సిద్ధేశ్వరపంత్ ఇంట్లో మకాం వేశాడు. అదే రాత్రి శ్రీసిద్ధేశ్వరపంత్‌కు పండరినాథుడు కలలోకి వచ్చి "నీ కుమార్తెను శ్రీవిఠల్ పంత్‌కు ఇవ్వు" అని చెప్పాడు. అతడు తన కలను విఠల్ పంత్‌కు చెప్పి, తన అభిప్రాయాన్ని స్పష్టీకరించాడు. ఈ సందర్భశుద్ధి ఎలా కుదిరిందంటే, అదేరాత్రి విఠల్ పంత్‌కు కూడా కలవచ్చి, "నీకు భక్తి, జ్ఞాన, వైరాగ్యాలపై ప్రీతి ఉంది. నీవల్ల లఖుమకు నలుగురు పిల్లలు కలుగుతారు. ఆమే నీకు సరియైన భార్య! ఇది నా ఆజ్ఞ!" అని ఆ విశ్వంభరుడైన విఠోబా చెప్పాడు. విఠల్ పంత్ కూడ తన స్వప్నాన్ని సిద్ధేశ్వర్ పంత్‌కు చెప్పాడు. అంతే! విఠల్ పంత్‌కు రుక్మిణీబాయితో వివాహమైంది.

అయితే, విఠల్ పంత్ దంపతులకు చాలాకాలం సంతానం కలుగలేదు. దానితో పంత్ గారికి సంసారవైరాగ్యం ఏర్పడింది. అప్పుడప్పుడూ భార్యతో తనకు సన్న్యసించాలని ఉందని, దానికి అనుమతి యివ్వవలసిందిగా కోరేవాడు. ఆమె దానికి మౌనంగా ఉండిపోయేది. మౌనం అర్థాంగీకారమా? లేక అర్థాంగి అంగీకారమా? అనేది తెలుసుకోలేకపోయాడు. ఒకరోజు రాత్రి ఆమె నిద్రపోతుండగా "నేను ఇల్లు విడిచి వెళుతున్నా"నన్నాడు. నిద్రలో ఉన్న ఆమె "ఊ" అని మూలిగితే అదే అంగీకార సూచకమని వెళ్లిపోయాడు.

విఠల్ పంత్ కాశీకి వెళ్లి శ్రీరామానందయతి దగ్గర సన్న్యాసం స్వీకరించి **'చైతన్యాశ్రమి'** అనే దీక్షానామంతో ఉండసాగాడు. కొంతకాలానికి శ్రీరామానందయతి శ్రీరామేశ్వరంపోతూ అలకాపురికి వచ్చాడు. అప్పుడు రుక్మిణీబాయి అశ్వత్థ వృక్షానికి ప్రదక్షిణం చేస్తూ ఉంది. శ్రీ రామానందయతికి నమస్కరించింది. ఆయన **"పుత్రవతీభవ"** అని ఆశీర్వదించాడు. ఆమెకు దుఃఖంతో పాటు నవ్వు కూడా వచ్చింది. ఆయన కారణమడుగగా తన సంగతి అంతా చెప్పింది. ఆమె చెప్పిన దాన్నిబట్టి ఆనవాళ్లు గుర్తించి తన దగ్గర **'చైతన్యాశ్రమి'**గా ఉన్న 'విఠల్ పంత్' రుక్మిణీబాయి భర్తగా తెలుసుకున్నాడు. పంత్‌గారితో ఏకాంతంగా మాట్లాడి ఆయునను గృహస్థాశ్రమాన్ని తిరిగి స్వీకరించేలాచేశాడు.

### సన్న్యాసిగా ఉన్న విఠల్ పంత్ మరలా గృహస్థుడు కావడం

గురువుగారి ఆజ్ఞను శిరసావహించి గృహస్థాశ్రమాన్ని తిరిగి ప్రారంభించిన విఠల్ పంత్, కలలో విఠోబా చెప్పిన రీతిగా, కాలక్రమేణ 'నలుగురు పిల్లల తండ్రి అయ్యాడు' వారే 1) నివృత్తినాథుడు 2) జ్ఞానదేవుడు 3) సోపానదేవుడు 4) ముక్తాబాయి.

వీరందరూ ఆళందిలోనే రెండు రెండేళ్ల వ్యత్యాసంలో జన్మించారు. వీరినామకరణాలన్నీ పరిశీలిస్తే ఇవి అధ్యాత్మ భావభూమికలలో సాధకుల



జీవితంలోగల నాల్గుఘట్టాలవలె ఉన్నాయి. పైగా అందులో ఒక క్రమిక వికాసం కూడ కనబడుతున్నది.

1) 'లోకప్రవృత్తి' నుండి విడివడి 'నివృత్తి' పొందడం – బహిర్ముఖమైన ఇంద్రియ ప్రవృత్తిని అంతర్ముఖం చేసుకోవడం **నివృత్తినాథు**డంటే, "అంతర్ముఖీనమైన చిత్తవృత్తిపై అధికారం సాధించిన యోగి" అని అర్థం!

2) అంతర్ముఖీనుడైన యోగి తపస్సమాధిచే సాధించేదే జ్ఞానం – ఆధ్యాత్మిక జ్ఞానం – దానికి ప్రతీకయే జ్ఞానదేవుడు లేక **జ్ఞానేశ్వరుడు.**

3) ఈ ఆధ్యాత్మిక సాధనలో సోపానాధిరోహణం చేస్తూ, చిట్టచివరి సోపానానికి చేరుకొనేంతవరకు సాధన కొనసాగిస్తూనే ఉండాలి. ఆ సాధకుని పేరే **సోపానదేవుడు.**

4) చిట్టచివరి సోపానాన్ని చేరుకొన్న సాధకుడు, సాధన పరిపక్వమైన దశలో పొందేది జీవన్ముక్త స్థితి! దానిని పొందినవాడే జీవన్ముక్తుడు! అట్టి స్థితికి చేరుకొన్న ఆమెపేరు **'ముక్తాబాయి'.**

వర్ణాశ్రమాచార వ్యవస్థ పటిష్ఠంగా ఉన్న ఆ కాలంలో విఠల్ పంత్ సంతానాన్ని వైదిక కర్మబాహ్యులుగా ప్రకటించి వెలివేశారు. కారణం, సన్న్యాసిగా ఉంటున్నవాడు గృహస్థుడై కన్న సంతానం కాబట్టి, కులభ్రష్ఠులకు ప్రాయశ్చిత్తం లేదన్నారు. మరి, ఉపాయమేమిటని ప్రశ్నిస్తే, 'అనన్యభక్తితో వ్యవహరించడమేనని' నిర్ణయించారు. విఠల్ పంత్ పుత్రులు శాస్త్ర ప్రమాణమైన ధర్మనిష్ఠను ఆచరించి చూపారు.

### జ్ఞానేశ్వర్ లేక జ్ఞానదేవుని మహిమలు

ఒకరోజు జ్ఞానదేవుడు వీధిలో వెళ్లుతుండగా కొందరు తుంటరులు ఆయనపేరు 'జ్ఞానదేవుడు' కాబట్టి, దాన్ని వెక్కిరించే నెపంతో వేళాకోళం చేయసాగారు. ఇంతలో ఒక నీళ్లు మోసేవాడు తన 'జ్ఞాన' అనే పేరుగల దున్నపోతుమీద చర్మపు సంచీపెట్టి అదే దారిలో వెళ్తున్నాడు. అతణ్ణి చూపిస్తూ

ఒకడు హేళనగా, "పేర్లో ఏముంది? ఆ దున్నపోతు పేరు కూడ 'జ్ఞానమే కదా!" అన్నాడు. దీనికి శ్రీజ్ఞానేశుడన్నాడు - "నువ్వన్నది నిజమే! దానిదీ నాదీ ఒకటే ఆత్మ!" అని ఊరుకోకుండా జ్ఞానదేవుడు ఆ దున్నపోతుతో, "ఋగ్వేదంలోని మూలశబ్ద ప్రణవాన్ని చెప్పవే!" అన్నాడు. వేదాన్ని మొదలుపెట్టి ఆ పశువు **"ఓం అగ్నిమీళే పురోహితం...."** దగ్గర్నుంచీ స్పష్టంగా వేదమంతా చదివేసింది. ఈ సంఘటన విక్రమశకం 1344 అంటే మాఘశుద్ధ పంచమినాడు జరిగింది. అప్పుడు జ్ఞానదేవుని వయస్సు 12 సంవత్సరాలు మాత్రమే! (క్రీ.శ.1263).

దున్నపోతు నోటినుండి వేదాలు పలికించి బ్రాహ్మణుల గర్వం అణచివేశాడు. దిగ్భ్రాంతులైన బ్రాహ్మణులు - **"విఠల్ పంత్ పిల్లలు ముగ్గురూ అవతార పురుషులన్న నిశ్చయం వారికి కల్గింది. వెంటనే వారికి "వీరు ఉత్తమ బ్రాహ్మణులు. వీరికి సాటి లేరు. అని శుద్ధపత్రాన్ని ఇచ్చారు.** వీళ్లు ముగ్గురూ మానవాళిని తరింప జేసేందుకు పరలోకం నుండి వచ్చిన తారకలే! వీరికి ప్రాయశ్చిత్తకర్మ ఎవరు చెప్పగలరు? సహజంగానే వారి కీర్తి సర్వత్రా వ్యాపించింది.

### శ్రీ జ్ఞానేశ్వరుల మరాఠీ రచనలు

**1. శ్రీమద్భగవద్గీత** మరాఠీభాషలో 'భావార్థదీపికా లేక జ్ఞానేశ్వరీ పేరుగల భాష్యరచన (ఇది క్రీ.శ.1290లో తన 15వ యేట వ్రాసినది)

**2. ధర్మసంకీర్తన** వేదోపనిషత్తుల్లో దాగిన మోక్ష స్వరూపాన్ని సాధ్యంచేసే వివేక వైరాగ్యాది సాధనరహస్యాల వివరణ

**3. అమృతానుభవము** శ్రీ గురు-నివృత్తి నాథుల ఆజ్ఞతో ప్రమాణ ప్రమేయ - భావరహిత నిత్యముక్తస్థితి అనే ధర్మాన్ని వివేచించే సిద్ధానువాద రూప గ్రంథం. (జ్ఞానేశ్వరులకు అన్న నివృత్తినాథులే గురువు)

**4. హరిపాఠ్** హరినామ సంకీర్తనాత్మక గ్రంథం



**5. అభంగగాథ** భక్తి - జ్ఞాన - వైరాగ్యాది సాధనల గురించి రసభరితమైన పద్ధతిలో ప్రతిపాదించిన రచన.

**6. చాంగ్‌దేవ్ ప్రశస్తి (చౌషష్టి)** శ్రీజ్ఞానేశుని అలౌకిక సామర్థ్యం, తాపీనదీ తీరంలో యోగబలంతో 1400 సంవత్సరాలు జీవించిన ఛాంగ్‌దేవుని చెవినిపడింది. దున్నపోతు నోటితో వేదాలు పలికించిన ఈ మహనీయుడెవరో తెలుసుకోవాలన్న కోరిక కలిగింది. అప్పుడు ప్రత్యక్ష దర్శనానికి ముందు, లేఖద్వారా ఆవ్యక్తిని పరీక్షిస్తే బాగుంటుందని లేఖవ్రాయడానికి తెల్లకాగితం తీసుకున్నాడు. కాని, శ్రీజ్ఞానేశ్వరుడికి ఆశీస్సులివ్వాలా? లేక నమస్కరించాలా? అన్నది నిర్ణయించుకోలేకపోయాడు. కాబట్టి, ఆయన ఆ తెల్లకాగితాన్ని అలాగే పంపించాడు. దానికి జవాబుగ జ్ఞానదేవుడు వ్రాసిన 64 ఓవీలు **చాంగ్ దేవ్ చౌషష్టి** లేక **చాంగ్‌దేవ్ ప్రశస్తి** అనే పేరుతో గ్రంథరూపంలో ప్రసిద్ధి చెందాయి.

ఆ జవాబుతో జిజ్ఞాసా పూర్వకంగా పులిమీద కూర్చుని చేతితో పామును కొరడాగా పట్టుకొని శ్రీజ్ఞానేశుని కలవాలని బయలుదేరాడాయన. చూడ్డానికి ఛాంగ్‌దేవ్ 1400 సంవత్సరాలు వృద్ధుడైనప్పటికీ శ్రీ జ్ఞానదేవుని దృష్టిలో అధ్యాత్మబోధ అనే క్షేత్రంలో పసివాడే. ఛాంగ్‌దేవ్ పులిమీద ఎక్కిరావడం తెలుసుకుని శ్రీ జ్ఞానదేవుడు జడమైన గోడను నడవమని ఆజ్ఞాపించాడు. గోడనడవడం ప్రారంభించింది. అది చూచి **'నేను జగత్తులో గొప్పయోగి'** అనుకున్న చాంగ్‌దేవ్ గర్వం హరించుకుపోయింది. ఆయన జ్ఞానేశునితో **'శరణు'** అన్నాడు. తరువాత ముక్తాబాయి (జ్ఞానేశ్వరునిచెల్లెలు) చాంగ్‌దేవుని భౌతిక దృష్టితో కూడిన జ్ఞానభావనను తొలగించి అధ్యాత్మ సాధకునిగా కృతార్థుణ్ణి చేసింది.

**7. యోగవాసిష్ఠానికి 'టిప్పణి'**

శ్రీ జ్ఞానేశ్వరులు రచనలకుగల వైశిష్ట్యమేమంటే, అంతవరకు భారతదేశంలో ఆచార్య పురుషులు వ్రాసిన ప్రస్థానత్రయ భాష్యాలు

సంస్కృతంలో వ్రాయబడి ఉండగా (ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత – వీటినే ప్రస్థానత్రయ మంటారు. వేదాంత ప్రస్థానత్రయమని అర్థం) మహారాష్ట్రలో పుట్టిన జ్ఞానేశ్వరుడు మాత్రం క్రీ.శ.1290లో తన మాతృ భాషయైన మరాఠీలో వ్రాయడం చూస్తే, సంస్కృతంలో మౌలిక వేదాంత గ్రంథాలకు ప్రముఖంగా ప్రస్థానత్రయానికి దేశభాషలో భాష్యరచనకు శ్రీకారం చుట్టినవాడు జ్ఞానేశ్వరుడని తెలుస్తుంది. వీరు వ్రాసిన గ్రంథాలన్నీ 'మరాఠీ భాషలోనే, ప్రధానంగా ఓవీ ఛందోబద్ధంగా రచనలుండడం చూడవచ్చు. వీరి భాష్యరచనాశైలి స్వానుభవజన్యమైన జ్ఞానంనుండి వెలువడిన కవితాత్మక, విచారణాత్మక భాష్యశైలిలో మరాఠీలోనే ఉండడం గమనింపదగింది.

## భగవద్గీతకు జ్ఞానేశ్వరీ భాష్యం – రచనాకాలం

గీతాభాష్యరచన జ్ఞానేశ్వరి, విక్రమ సంవత్సరం 1347కు సరియైన శాలివాహన శకం 1212 అంటే (1212+78=1290) క్రీ.శ.1290లో సేవాసేc గ్రామంలో మహాలయాదేవీ మందిరంలో జరిగింది. ఈ భాష్యరచన చేసినప్పుడు జ్ఞానదేవుని వయస్సు 15 సంవత్సరాలు.

## జ్ఞానేశ్వరిని గ్రంథస్థం చేసిన లేఖకుడు శ్రీసచ్చిదానందబాబా

శ్రీజ్ఞానేశ్వరులు సేవాసేc గ్రామానికి చేరిన సమయానికి, ఒకస్త్రీ తన భర్త శవాన్ని ఒడిలో పెట్టుకొని దుఃఖిస్తూ ఉంది. ఆ మరణించిన వ్యక్తిపేరు **'సచ్చిదానందు'**డని తెలుసుకున్న జ్ఞానేశుడు ఇట్లన్నాడు. **"సత్ – చిత్ – ఆనందాలకు ఎక్కడైనా మరణం సంభవిస్తుందా?"** అని విస్మయం ప్రకటించి, ఆ వ్యక్తి శవాన్ని తాకగానే, మృతుడు నిద్రనుండి మేల్కొన్నట్లుగా లేచి కూర్చున్నాడు.

ఈ పునర్జీవితుడైన వ్యక్తియే శ్రీసచ్చిదానందబాబా అనే పేరుతో ప్రఖ్యాతుడై, జ్ఞానేశ్వరునిచే చెప్పబడిన భగవద్గీతా భాష్యం 'జ్ఞానేశ్వరీ లేక భావార్థదీపిక' కు లేఖకుడుగా వ్యవహరించారు. ఈ విషయాన్ని జ్ఞానేశ్వరి చివరలో శ్రీజ్ఞానేశ్వరులే పేర్కొని ఉన్నారు.



## జ్ఞానేశ్వరునికి మంత్రదీక్ష నిచ్చిన గురువు ఆయన అన్నగారు శ్రీనివృత్తినాథ్ మహరాజ్

శ్రీ నివృత్తినాథులు శ్రీ గహనీనాథుని వద్ద పొందిన మంత్రోపదేశాన్నే శ్రీ జ్ఞానదేవునికి ఉపదేశించారు. ఆదినాథుని నుండి గహనీనాథుని వరకు పరంపరగా వస్తున్న ఈ సంప్రదాయం విశేషించి యోగమార్గానికి సంబంధించినదై ఉంది. ఈ పరంపరలోని వారందరు యోగీశ్వరులే!

నివృత్తినాథుడు తమ గురువర్యుని ఆజ్ఞానుసారం తన సోదరీ, సోదరులకు శ్రీకృష్ణోపాసనా దీక్షనిచ్చారు. ఆనాటినుండి మహారాష్ట్ర దేశంలో భక్తి ఉద్యమం ప్రచారంలోకి వచ్చింది. జ్ఞానదేవుడు మాత్రం జ్ఞాన, భక్తి, వైరాగ్యాలనే మూడింటితో, యోగమార్గాన్ని కూడ అనుసరించారు. ఆయన ఒక మహాయోగీశ్వరుడు. ఆయన మహిమలన్నీ యోగబలానికి చెందినవే!

శ్రీనివృత్తినాథ మహరాజ్‌గారి సమాధి నాసిక్ జిల్లాలోని త్రయంబకేశ్వరం దేవాలయం ప్రక్కన ఉన్నది. అన్నగారి వద్ద దీక్షపొందిన జ్ఞానేశ్వరులు అప్పటినుండి గురువుపట్ల చూపవలసిన శ్రద్ధనే చూపారు. పైగా గురువును ఈశ్వరునిగా భావించారు. జ్ఞానేశ్వరిలో వీరు తమ అన్నగారిపైగల గురుభావాన్ని చాలాచోట్ల ప్రకటించారు. గురుదేవులకు సేవచేసే సర్వవస్తుసముదాయం తానేనని భక్తితన్మయుడైనవాడు జ్ఞానేశ్వరుడు.

## జ్ఞానేశ్వరుల సమాధి

జ్ఞానదేవులు తీర్థయాత్ర చేశారు. పండరీపురానికి చేరారు. అక్కడ శిష్యుడు సంత్ నామదేవ మహరాజ్ నామ సప్తాహం జరిపారు. ఆ ఉత్సవాల్లో పాల్గొన్న తర్వాత జ్ఞానేశ్వరులు తమ సోదరి ముక్తాబాయిని వెంటబెట్టుకొని

విక్రమసంవత్ 1353, శాలివాహన శకం 1218+78= క్రీ.శ.1296 మార్గశిర బహుళ త్రయోదశి గురువారం మధ్యాహ్నం శ్రీ జ్ఞానదేవులు సజీవసమాధిగైకొన్నారు.

వీరి తర్వాత ఒకటిరెండు సంవత్సరాలలోపలనే శ్రీనివృత్తినాథులు, శ్రీసోపానదేవులు, యోగిని ముక్తాబాయి కూడ సమాధి గైకొన్నారు. శ్రీ జ్ఞానేశ్వర్ మహారాజ్ వారి సమాధి ఆళందిలో ఉన్నది. సమాధిగైకొన్న సమయంలో శ్రీజ్ఞానదేవుడు వయస్సు 21 సంవత్సరాల మూడునెలల ఐదురోజులు మాత్రమే!

## సమాధి స్థలం

ఇంద్రాయణీ నదీ తీరంలో శ్రీసిద్ధేశ్వరుని ఎదుట నంది విగ్రహాన్ని ప్రక్కకు తొలగించి, అక్కడ నుండి బిలంలోకి వెళ్లి శ్రీ జ్ఞానేశుని సమాధిస్థలాన్ని, శ్రీనామదేవుని కుమారుడు శుభ్రం చేశాడు. శ్రీజ్ఞానేశులు సమాధిలోకి పోయికూర్చున్నారు. శ్రీనివృత్తినాథుడు రాతిని బెట్టి ద్వారాన్ని మూసివేశాడు. శ్రీజ్ఞానేశ్వరుల సజీవసమాధి కాలం క్రీ.శ.1296. మార్గశిర బహుళ త్రయోదశి గురువారం. కారణజన్ములైన ఆయన సోదరులు, సోదరీమణి కూడ రెండు సంవత్సరాల్లో సమాధిగతులైనారు. **మార్గశిరమాసంలోనే అందరు ముక్తి మార్గాన్ని చూరగొన్నారు. మోక్షానికి దారిచూపే మాసమే మార్గశిర మాసంకదా!**

## సంత్ శ్రీఏకనాథ్ మహారాజ్‌కు జ్ఞానేశ్వరుల సమాధి సాక్షాత్కారం

ఒకరోజు శిష్యుడు ఏకనాథుడు (భావార్థరామాయణకర్త) నిద్రిస్తున్నప్పుడు జ్ఞానదేవుడు స్వప్నదర్శనమిచ్చి 'నీవు ఆళందికి వచ్చి సమాధి తెరిచి దర్శనం చేసుకో! అక్కడ ఆ జ్ఞానవృక్షం వేరు తీసుకుని ఆ సమాధి తిరిగి మూసేయి అన్నాడు. ఆ ప్రకారంగానే **ఏకనాథుడు** శిష్యులతో కలసి



ఆళందికి వచ్చాడు. ఇంద్రాణి నదిలో స్నానంచేసి సిద్ధేశ్వరుని దర్శనం చేసికొన్నాడు. తరువాత జ్ఞానదేవుని సమాధి తెరిచి ఏకనాథుడు లోపలికి వెళ్లినప్పుడు దివ్యరూపంలో జ్ఞానదేవుడు వజ్రాసనం వేసుకొని కూర్చుని ఉండటం అతనికి కనిపించింది. అతనికి నమస్కరించగానే సమాధిలో ఒక మూలిక కనిపించింది. అతని ఆజ్ఞననుసరించి దాన్ని బయటకు తెచ్చి, తర్వాత సమాధిని మూసివేశాడు.

## ఉపసంహారం

భారతదేశంలో భక్తి ఉద్యమం (Bhakti Movement) అనేది మధ్యయుగీన కాలంలో అంటే క్రీ.శ.1250 – క్రీ.శ. 1850 వరకు సాగిన ఒక సుదీర్ఘ ఉద్యమం. ఈ ఆరువందల సంవత్సరాల కాలంలోనే భారతీయ సంస్కృతీ పునాదులు పటిష్ఠమయ్యాయి. మహాత్మాగాంధీగారి స్వాతంత్ర్య సముపార్జనకు భక్తి ఉద్యమ పునాదులే అత్యంత దోహదకారి కాగా, భారతీయులందరిని ఒక్క తాటిపై నడిపించే శక్తి గాంధీగారికి అప్రయత్నంగా సిద్ధించింది. ఈ ఉద్యమం దేశంలో భిన్నత్వంలో ఏకత్వాన్ని (Unity in Diversity) సాధించిన ఏకైక ఉద్యమం కావడంతో ఆంగ్లేయులు, ఏమీచేయలేక, ఈ దేశాన్ని తమంతట తామే వదలిపెట్టిపోయారు. ఇది భక్తి ఉద్యమం పునాదిగ భారతదేశం సాధించిన ఘనవిజయం! ఆ ఉద్యమాన్ని సక్రమంగా నడిపించిన దేశనాయకుడు మహాత్మాగాంధీ! భారతదేశ చరిత్రలోనే ఈ ఉద్యమ విజయం ఒక సువర్ణాక్షర ఘట్టం!

మహారాష్ట్ర సాహిత్యంలో వెలసిన భక్తి ఉద్యమంలో మూడు, నాల్గు దశలు అత్యంత ప్రముఖమైనవి. 1) నాథపంథా ఉద్యమం 2) మహానుభావ పంథా ఉద్యమం 3) భాగవతపంథా లేక వార్కరీ పంథ ఉద్యమం వీటి తర్వాత పునరుజ్జీవనోద్యమం, రామదాసీ పంథ ఉద్యమాలు కూడ దోహదం చేశాయి. ఇందులో **భాగవతపంథా లేక వార్కరీపంథాకు మూల పురుషుడు**

**శ్రీసంత్ జ్ఞానేశ్వర్ మహారాజ్‌గారు. (1275–1296)** ప్రాచీనుల్లో ప్రాచీనుడుగా నవీనుల్లో నవీనుడుగా సంప్రదాయంలోని సందర్భశుద్ధిని నిరూపించిన ఘనత జ్ఞానేశ్వరులది. మహారాష్ట్రదేశంలో అద్వైత సిద్ధాంతాన్ని, అద్వైత భక్తిని, దేశకాల పరిస్థితుల దృష్ట్యా ఒక ప్రధాన సాధనంగా గ్రహించి, భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించే దిశగా విస్తృత ప్రచారంచేయడానికి మధ్యయుగంలో (Medieval Period) లో పుట్టిన ఆదిశంకరుల అపరావతారంగా భక్తులు జ్ఞానేశ్వర్ గారిని సంభావిస్తారు. జ్ఞానానికి ఈశ్వరుడు జ్ఞానేశ్వరుడు ఆయనే ఆదిగురువుగా అవతరించిన శ్రీ శంకరుడు. జ్ఞానదేవుడు, జ్ఞానేశుడు అని పలుపేర్లతో పిలువబడిన జ్ఞానేశ్వరులు నిజంగా అటువంటి జ్ఞానగురువే అనడంలో ఏమాత్రం సందేహం లేదు.

### జ్ఞానేశ్వరులపై రచనలు - అనువాదాలు

1. "ఆది తీర్థావళీ వ సమాధి" : నామదేవుడు. (ఇది నామదేవుని, జ్ఞానేశ్వరుని జీవిత కథ)
2. శ్రీజ్ఞానేశ్వర దర్శనమ్ : (జ్ఞానేశ్వర స్మారిక 1940)
3. జ్ఞానేశ్వరి – భగవద్గీత : దిగవల్లి శేషగిరిరావు (2003)
4. జ్ఞానేశ్వరి – భగవద్గీత : మిరియాల విమలాశర్మ (2011)
5. అమృతానుభవము : అనువాదం : నైనారు అప్పాస్వామి, పీఠిక : ముదివేడు ప్రభాకరరావు

**6) Medieval Indian Literature (Vol-III) :**

**An Anthology** Ed. **K. Ayyappa Panikkar**
Sahitya Academy, New Delhi, 1999.

* * *

## 4. జనాబాయి

**"–ముక్తి మార్గవాంఛ నాదిదేవు విష్ణునాశ్రయింపుడు**
**ముక్త సంగజనుల గూడి శైశవమున" – భాగ. 7–216**

**శైశవదశలోనే ప్రహ్లాదుడు ముక్తిమార్గ వాంఛతో విష్ణుపాదాలు ఆశ్రయించినట్లుగా, మహారాష్ట్రలోని పండరీపురంలో పుట్టిన జనాబాయి, ఒక సహజబోద్ధగా,** స్వయంప్రభగా, స్వయంప్రకాశప్రబోధితురాలై పాండురంగ విఠ్ఠలునిపై భక్తి కల్గి, పాటలు పాడుతూ జీవితావసానంలో ముక్తిని చూరగొన్నది. అటువంటి స్వయంప్రభాజ్యోతి జనాబాయి జీవితవిశేషాలు చూద్దాం.

### పండరీపురంలో కార్తికోత్సవం

మహారాష్ట్రంలో చంద్రభాగానదీ తీరంలోని పండరీపురంలో పాండురంగ విఠ్ఠలుని ఆలయం విరాజిల్లుతూ ఉంది. భక్తులు ఆ దేవుని పుండరీక వరదా! పండరినాథా! పాండురంగా! విఠ్ఠలనాథా! విఠ్ఠలా! విఠోబా! విట్హో! అని వారి కిష్టమైన పేర్లతో పిలుస్తుంటారు. శ్రీకృష్ణ భగవానుడే పాండురంగడు కనుక ఆయన దేవేరి పేరు రుక్మిణీదేవి. జనాబాయి కథకు రంగస్థలం పండరిపురం. దానికి సమీపంలోగల 'గంగాఖేడ్' (ఖేడ్= గ్రామం) గంగా అనే గ్రామంలో శూద్ర కుటుంబంలో జన్మించింది. ఈమె దమ, కరుణక అనే దంపతుల సంతానం. ఈమె నామదేవుని శిష్యురాలు. భక్తురాలు. గురువు అడుగుజాడల్లో 350 అభంగాలను మరికొన్ని కృతుల్ని రచించింది.

పాండురంగ విఠ్ఠలనాథుని సేవించుకోవడానికి ప్రతిరోజు భక్తులు తండోపతండాలుగా వస్తుంటారు. పండరీపురానికి విశేష ఉత్సవాల సందర్భాలలోనైతే చెప్పనవసరం లేదు. ఇసుక వేస్తే నేలరాలనంత జనం క్రిక్కిరిసిపోతారు. అలాంటి విశేష ఉత్సవాల్లో కార్తికోత్సవం ఒకటి. ఆ

ఉత్సవంలో అంగరంగ వైభవంగా పాండురంగనికి అలంకారాలు చేసి, ఆభరణభూషితుని చేసి చూచి ఆనందించే భక్తజనులు కోకొల్లలు. ఆ దర్శనభాగ్యమే మహాభాగ్యంగా భావించే వారెందరో!

ఆ విధంగా పండరీపురానికి వచ్చిన ఒక కుటుంబంలో జనాబాయి అనే ఒక ఆరేళ్ల అమ్మాయి పెద్దపెద్ద కళ్లతో ఆ ఉత్సవాన్ని కళ్లారాచూస్తూ, చోద్యంతో ఆశ్చర్యాన్ని ఆనందాన్ని అనుభవిస్తూ ఉంది. గంధపుష్పాద్యలంకారాలతో విచిత్రంగా వెలిగిపోతూ ఉన్న పూలరంగడు పన్నీరు, దవనం మొదలైన పరిమళద్రవ్యాల సువాసనలతో గుమ్ముగా తాదాత్మ్యాన్ని పొందుతూ ఉండగా ఆ చిన్న అమ్మాయి, గుడ్లప్పగించి స్వామిని ఆయన ప్రక్కనే ఉన్న దేవేరిని చూడసాగింది.

ఉత్సవాలకు వచ్చిన భక్తులు ఒకళ్లకొకళ్లు కూడబలుక్కుంటూ, చూడు చూడు! పాండురంగడు ఎంత అందంగా ఉన్నాడో! అని. అదేంటమ్మా! మా రుక్మిణమ్మ మాత్రం ఆయన ప్రక్కన అందాలు ఒలకబోస్తూ నవ్వుతూ ఉంది చూడు, అని మరొకరు చెప్పుకోవడం ఆ అమ్మాయి జనాబాయి వినింది. ఓహో! ఈ స్వామిపేరు **'పాండురంగడు'**, ఆయన భార్యపేరు **'రుక్మిణి'** అని తెలుసుకొంది. తండ్రీ, తల్లీ! అని భక్తులు పలకడం గమనించిన జనాబాయికి అసలు రహస్యం తెలిసింది.

వారు జగత్తుకే 'తల్లీ' 'తండ్రీ' అని, తత్‌క్షణమే ఆమె ఒక తీర్మానానికి వచ్చింది. ఈ ప్రపంచానికే తల్లితండ్రులైన వీరిని వదలి మనం ఇంకెక్కడికి పోనవసరం లేదు. వారున్న చోటే తాను ఉండాలని నిశ్చయించుకొన్నది.

ఇంతలో స్వామివారి పల్లకి ఊరేగింపుగా నాల్గుతిరుమాడ వీథుల్లో తిరిగి స్వస్థానం చేరుకొన్నది. భక్తులకు ప్రసాదాలు పంచిపెట్టారు. జనాబాయి తల్లితండ్రులు ప్రసాదాలుతెచ్చి అమ్మాయికిచ్చి, గుడిలో స్వామిని దర్శించి, కాసేపు కూర్చొని, ఇంక బయలు దేరుదామన్నారు.



"ఎక్కడికి?" అంది జనాబాయి

"ఎక్కడికేమిటి? మన ఇంటికమ్మా!" అన్నది తల్లి.

"ఇంటికా? ఇంట్లోఏముంది? మన అమ్మానాన్నలు ఇక్కడ ఉన్నారు కదా! ఇదే మన ఇల్లు" అంది.

"అదేమిటమ్మా! విడ్డూరంగా మాట్లాడుతున్నావు? ఇది స్వామివారి గుడి కదా! గుడిలో ఎవరైనా కాపురం చేస్తారా? చోద్యంగా ఉందమ్మా నీ మాటలు! బయలుదేరు" అని తల్లి పురమాయించింది.

"మీరేమైనా చెప్పండి. నాకు మాత్రం ఇదే నా ఇల్లు. ఇప్పటికి తెలుసుకున్నాను. ఈ స్వామి గుడి విడిచి నేను రాను మీరు వెళ్లండి" అంది.

"అయ్యో! అయ్యో!! ఈ పిల్లకేమో అయింది. ఇలా పిచ్చి పిచ్చిగా అమ్మాయి మాట్లాడుతుంటే, మీరు బెల్లంకొట్టిన రాయిలా అలా చూస్తూ ఊరుకుంటారేమిటండీ! కాస్త బుద్ధి చెప్పక!" అని తల్లి భర్తను విసుక్కుంది.

"చిట్టితల్లీ! జనా! ఇది మన ఇల్లుకాదమ్మా! దేవుడుండే గుడి! ఇక్కడెవరూ రాత్రిళ్లు ఉండరాదు. ఎవరి ఇంటికి వారు వెళ్లిపోవాలే తప్ప, ఇక్కడ ఉంటే తప్పు, అపచారం, అందుకని రామ్మా! మన ఇంటికి పోతాము" అన్నాడు. జనాబాయి 'ససేమిరా' అన్నది.

ఒకవేళ ఈ గుడి వాతావరణం బాగా నచ్చి ఈ అమ్మాయి రానంటున్నదేమోనని భావించిన తల్లి, తల్లీ! మళ్లీవచ్చే వారం వద్దాంలే గుడికి, ఇప్పుడు ఇంటికి పద" అంది.

"వారం రోజులా? ఒక్కక్షణమైనా నేను నా స్వామిని విడిచి ఉండగలనా? అసంభవం! ఇక, మీరు వెళ్లడం మంచిది నాకు నా స్వామితో చాల మాట్లాడవలసి ఉంది. కాబట్టి ఇక్కడే ఉండిపోతాను. రాను గాక రాను" అని కచ్చితంగా చెప్పేసింది జనాబాయి.

## సంత్ నామదేవుని రాక

తల్లి చేయిపట్టుకోబోతే విదిలించుకొని గుడికేసి పరుగెత్తడం ప్రారంభించింది. ఆమెకు అభిముఖంగా ఒక ఆరడుగుల పొడుగుగల మహానుభావుడెవరో, వెంట కొందరు శిష్యులు వస్తుండగా వడివడిగా అడుగులు వేస్తూ వస్తున్నాడు. తల్లినుండి తప్పించుకొని గుడి చేరుకోవాలనే తపనతో జనాబాయి అర్ధనిమీలిత నేత్రాలతో పరిగెత్తుతూ ఎదురుగా వస్తున్నదెవరో గమనించకపోవడమేకాదు, ఒక సన్నని రాతినేలపొర కాలి బొటనవేలిని గట్టిగా తట్టుకోగా బోర్లగిల సాష్టాంగదండ ప్రణామం చేస్తున్న విధంగా పడిపోయింది జనాబాయి. ఆమె శిరస్సు సరిగ్గా ఎదురుగావస్తున్న ఆ సాధువు పాదాలకు ఆనుకున్నది.

తన పాదాలకు దండప్రణామం చేస్తున్నట్లు అవశంగా వాలిపోయిన ఆ చిన్ని బాలికనుచూచి, నామదేవుడు ఆశ్చర్యచకితుడయ్యాడు. వెంటనే, ఆమె రెండు భుజాలు పట్టుకొనిలేపి, 'దెబ్బలేమీ తగులలేదు కదమ్మా' అని యథాలాపంగా అంటూ ఆమె ముఖం చూచి ఆనందంతో – ఓహోహో, గోపికా! జ్ఞానమ్మా! నువ్వాతల్లీ! గోపీజనవల్లభుని చేరుకోవడానికి వ్రేపల్లె నుండి ఒక తొందరకత్తెయైన సెలయేఋలా ప్రవహిస్తూ వచ్చి నా పాదాలను స్పృశించి పునీతం చేశావు కదా తల్లీ! ధన్యుణ్ణి!" అంటూ ఉండగా జనాబాయి తల్లితండ్రులు ఆమెను సమీపించారు.

"అయ్యో! మోకాలికి, మోచేతులకు దెబ్బలు తగిలాయా తల్లీ! ఏదీ చూద్దాం!" అని ఆదుర్దాగా తల్లి పరామర్శించింది. అప్పటికి కాస్త తెప్పరిల్లిన జనాబాయి, "స్వామీ! క్షమించండి! తమరెవరో నాకు తెలియదు. స్పృశించి అపచారం చేశానేమో! వీరు నా తల్లిదండ్రులు. నేను పండరీపురంలో నివసిస్తున్నాను. మీరు చూస్తే మహానుభావులుగా కనబడుతున్నారు. నేనెంత? నా బతుకెంత? నేనేమిటి! మీ పాదాలను పునీతం చేయడమేమిటి? నిజం చెబితే పునీతురాలైన దాన్ని నేను. అనుకోని విధంగా మీ దర్శనభాగ్యం



నన్ను నా జీవితాన్ని పవిత్రం చేశాయి. మీ పిలుపులు, పరామర్శలు నన్ను ద్వాపరయుగంలోని ఋషులను జ్ఞాపకానికి తెచ్చాయి. నాకిప్పుడు ఒకటి తెలుస్తున్నది. నా జీవిత గమ్యస్థానానికి చేర్చడానికి ఆ పాండురంగడే పంపిన గురువుగా మిమ్మల్ని నేను స్వీకరిస్తున్నాను. దయచేసి నన్ను తమ శిష్యురాలినిగా స్వీకరించి అనుగ్రహించండి అని చేతులు జోడించి ప్రార్థించింది.

ఆ మాటలు వింటూనే "తల్లీ! జ్ఞానమ్మా! అది నీ సౌజన్యమమ్మా! ఇంతకీ నేనెవరో చెప్పలేదుకదా నీకు! **నన్ను 'నామదేవు'డంటారమ్మా! సంత్ శిరోమణి శ్రీజ్ఞానేశ్వర మహారాజ్ శిష్యపరమాణువును, నీవు నన్ను గురువుగా స్వీకరించానని చెప్పడం అంతా దైవసంకల్పం!** నిన్నటిరోజు రాత్రి పండరినాథుడు నాకలలో కన్పడి, జ్ఞానగోపిక పండరీపురంలో పుట్టి ఐదేళ్లయింది. ఆమె రేపు నా వద్దకు వస్తున్నది. నీవు సరిగ్గా ఆమె దేవాలయంలో ప్రవేశింపక ముందే నీ దర్శన మనుగ్రహించి, ఆమెను నీ శిష్యురాలిగా చేసుకో! ఆమె నన్ను చేరుకోవడానికి మార్గోపదేశం చేయి. ఆమె సంరక్షణభారం నీదే" అని ఆదేశించారు. పండరినాథుని మాటచొప్పున "నేను నీకు అభిముఖంగా త్వరిత గమనంతో వచ్చి నీ మార్గానికి అడ్డుపడ్డాను" తల్లీ! క్షమించు అన్నాడు.

"అయ్యో! తప్పంతా నాదే స్వామీ! బాల్య చాపల్యంతో ఉన్న నేను గురువును ఆశ్రయింపక, గోవర్ధనుని చూడబోవడం, ఆ స్వామి ఆచరించి చూపిన సంప్రదాయ మార్గానికి విరుద్ధమనే జ్ఞానం నాకు లేకపోయింది. గోవర్ధనుడు నా తప్పును సరిదిద్ది నన్ను ఉద్ధరించడానికే మీ దర్శనభాగ్యం నాకు అనుగ్రహించాడు. సాందీపని శిష్యుడు శ్రీకృష్ణుడన్నది జగత్ప్రసిద్ధం కదా! అలాగే ఈ జనాబాయి శ్రీనామదేవుని శిష్యురాలన్న విషయం లోకానికి తెలియవలసిన అవసరంలేదా? గురుశిష్య సంప్రదాయం పాటింపకపోతే ముక్తికి త్రోవచూపేదెవరు? అన్నది జనాబాయి.

ఇంతలో జనాబాయి తల్లి తండ్రులకు నమస్కారం చేశాడు నామదేవుడు. ప్రతినమస్కారం చేశారు వారు. జనాబాయి ఆ రోజు ఉదయం స్వామిని చూచినప్పటినుండి విచిత్రంగా ప్రవర్తిస్తూ ఉందని తాను గుడి వెడలి రానంటున్నదని నామదేవులకు చెప్పి ఆమె ప్రవర్తనలో పరివర్తన తీసుకురావాలని ప్రార్థించారు.

వారి మాటలు అమాయకంగా తోచడం వల్లనేమో సన్నగా నవ్వుతూ నామదేవుడు "ఆమె ప్రవర్తనే సరియైనది, మనలోనే పరివర్తన రావలసి ఉంది. సత్యానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నది మనం" అని మనసులో అనుకొని, మీదంపతులిద్దరు అదృష్టవంతులు! మీ ఇంట 'జ్ఞానమ్మ' వంటి అరుదైన బిడ్డ పుట్టడం మీరు చేసుకొన్న పూర్వజన్మ సుకృతం! అన్నాడు.

**జనాబాయి పూర్వజన్మ వృత్తాంతం**

"ఈమె ఎవరనుకున్నారు? పూర్వజన్మలో ఒక **గోపిక! పేరు జ్ఞానమ్మ! కృష్ణభక్తురాలు!** ఆమె నిరంతరంచేసే కృష్ణభక్తి ఉపాసనలో ఎక్కడో ఒకచోట చిన్న పొరబాటు జరగడం కారణంగా యోగభ్రష్టురాలైంది. యోగంలో భ్రష్టత్వం పొందినవారిని భగవంతుడు అలాగే వదలివేయడు. వారు మరుసటి జన్మలో –

**"శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోఽభిజాయతే"** అని గీతలో శ్రీకృష్ణభగవానుడే చెప్పినట్లుగా, ఒకసారి యోగభ్రష్టులైనవారు మరుజన్మలో ఆచారవంతులు, శ్రీమంతులైనవారి ఇంటిలో జన్మించి తాము ఎక్కడ యోగసాధన నిలిపారో, అక్కడినుండి ప్రారంభించి సిద్ధిని పొందుతారని వాగ్దానంచేశాడు గీతాప్రవక్త. ఆవిధంగా మిగిలిపోయిన ఆ యోగసాధన కొనసాగించి యోగసిద్ధి పొందడానికి **'జ్ఞానమ్మ' 'జనాబాయి'**గా పండరీపురంలో స్వామి ఉన్న ఊరులోనే జన్మించింది."



"పూర్వజన్మలో పొందలేని కృష్ణైక్యాన్ని ఈ జన్మలోనైనా పొందాలని మీ ఇంట పుట్టింది. ఈ జన్మలో ఆ **'కృష్ణానుభవజ్ఞానం'**తో పుట్టి, స్వామిని అన్వేషిస్తూ, ఆయన వెంట పడుతున్నది. ఈమె అందరు ఆడపిల్లల వంటిది కాదు. ఈమె ఒక కారణజన్మురాలు! ఈ జన్మే ఈమె ఆఖరి జన్మ! ఈ జన్మలో ఆమె తాననుకొన్నది సాధించితీరుతుంది. అదే కృష్ణైక్యం కావడం! ఆ కృష్ణుడెవరో కాదు. పండరీపురంలో వెలసిన పాండురంగ విట్ఠలుడే!" అన్నాడు నామదేవుడు.

జనాబాయి విచిత్ర ప్రవర్తనకు మూలకారణం ఇదా? అని తెలిసికొన్న తల్లితండ్రులు విస్తుపోయారు. ఆనంద ఆశ్చర్యాలతో కన్నీళ్లు పెట్టుకున్నారు. అయితే ఇప్పటి సమస్యకు పరిష్కారం ఎలా? ఆమె గుడిలోనే ఉండిపోవడం ఎలా సంభవం? ఈ సమస్యను మీరే పరిష్కరించాలి స్వామీ అని. ఆ దంపతులు ప్రాధేయపడ్డారు.

"అదొక సమస్యే కాదమ్మా! మీరు నిశ్చింతగా ఉండండి. నేను పండరీపురంలో ఉన్నాను. మీరు పండరీపురంలో ఉన్నారు. గురువు ఇంట్లో శిష్యురాలు ఉండడం గురుకులవాస నియమం. కాబట్టి, జ్ఞానమ్మ ఇకమీదట మా ఇంట్లో ఉంటుంది. మీరప్పుడప్పుడు వచ్చి ఆమెను చూచి పోతుండవచ్చు. అంతే!" అన్నాడు నామదేవుడు.

అందరూ నామదేవుని పరిష్కారానికి సంతోషించారు. జ్ఞానమ్మ అనే జనాబాయి తల్లితండ్రులకు నమస్కరించి వారి అనుమతి అడిగింది. వారు అలాగే గురువులు నామదేవుల ఇంట్లో బుద్ధిగా మసలుకొని నీ 'కృష్ణభక్తి ఉపాసనను కొనసాగించమని అనుమతించి ఆశీర్వదించారు.

**ఘోరమైన గాలి వాన...**

నామదేవుడు గృహస్థుడు. తల్లీ, భార్య, కూతురు, కొడుకులు, కోడళ్లు, మనుమలు ఉన్నారు. తల్లిపేరు గుణాబాయి. కోడలుపేరు రాధాబాయి.

అని తెలుస్తోందికాని ఆయన భార్యపేరు, నలుగురు కొడుకులపేర్లు, మనుమల పేర్లు తెలియడం లేదు.

గురువు నామదేవుడి ఇంటికి వచ్చినప్పటినుండి జనాబాయి, ఇన్నాళ్లుగా తాను చేస్తూవచ్చిన భజన, నామజపం, ధ్యానం, యోగం చేసుకుంటూ ఆనందంగా కాలం గడుపుతోంది. ఇంటి పనుల్లో సాయపడేది.

ఒకరోజు హఠాత్తుగా ఆకాశం మేఘావృతమై ఉరుములు మెరుపులతో చిలికి చిలికి గాలివానగా పెద్దదై ఘోరంగా మారి చెట్లన్నీ కూలిపోగా, గుడిసెల కప్పులులేచి మట్టిపాలయ్యాయి. ఊరు ఊరంతా అల్లాడిపోయింది. చిమ్మచీకటి కమ్మివేసింది. నామ దేవుడు వీధి తలుపు తెరచి వాకిట నిలబడి చూడసాగాడు. ఎంత అంధకారం ఉన్నా ఆ చీకట్లో వెలుగురేకలు ముంగిట కనబడసాగింది. మసక చీకట్లో ఇంటి ప్రహరీగోడ కూలిపోయినట్లు గుర్తించాడు, ముంగిట్లోని ఇంటిపైకప్పులేచి ఎక్కడో ఆకాశంలో నిలబడివుంది. ఆ చిమ్మచీకట్లో ఈ వెలుగు రేకలు ఎక్కణ్ణుంచి వచ్చాయో తెలియడంలేదు. పడిపోయిన గోడల వెనుక ఒకవ్యక్తి ఎవరో పనిచేస్తున్నట్లున్నాడు. ఆ వ్యక్తి ఎవరో? తెలియడంలేదు. ఇంటిగోడలమీది పైకప్పు ఎలా పైకి లేచి నిలబడివుందో అంతుపట్టడంలేదు. ఏమిటి ఈ మాయ! పాండురంగడే నా ఇల్లు కూలిపోతుంటే చక్రం అడ్డుపెట్టి రక్షిస్తున్నాడా! నారక్షణ భారం అలా వుండనీ, నాతో బాటు "జ్ఞానమ్మ" ఇంటిలోని వారు వీరందరి సంరక్షణ భారం స్వామినిర్వహిస్తున్నాడని స్పష్టమైంది. 'జ్ఞానమ్మ సంరక్షణ భారం నీదే' అని మాటవరసకు అన్నాడుగాని అందరి యోగక్షేమాలు చూచేవాడు ఆయనేకదా! ఆశ్రితుల్ని రక్షించడంలో స్వామి అందెవేసిన చేయి కదా!" అనుకుంటూ ప్రహరీగోడకు వెలుపలకు వెళ్లగా, అక్కడొకవ్యక్తి తాపీపని చేస్తున్నాడు. ఎన్నాళ్లుగానో పరిచయమైన వ్యక్తిగా కన్పడగా చటుక్కున చేయిపట్టుకున్నాడు. ఆకాశంలో మెరిసిన మెరుపులో ముఖం కనబడి "స్వామీ! పుండరీక వరదా! ఈ దాసుని ఇంటికి



మీరు సేవచేయడమేమిటి? అయ్యో! వర్షంలో తడిసి ముద్దయిపోయారే! ఏమిటో ఈ భక్తజన వాత్సల్యం! ఇంతకంటే దయాపరత్వం మరొకటుంటుందా తండ్రీ! చాలు స్వామి చాలు! రండి మీరు సురక్షితంచేసి ఇచ్చిన ఈ దాసుని ఇంటిలోకి వచ్చి మమ్మల్ని ధన్యతముల్ని చేయండి." అంటూ చేయిపట్టుకొని ఇంటిలోపలికి పిలుచుకువచ్చి, తుండు గుడ్డతో తల తుడిచి, దీపకాంతిలో చూస్తాడు కదా! స్వామి నిరాభరణుడై ఉన్నాడు. స్వామి చేతులు, పాదాలు శుభ్రమైన నీటితో కడిగి, ఎత్తైన పీటమీద కూర్చోబెట్టాడు. దుఃఖం పొర్లుకొని వస్తున్నది. రాత్రిపూట బయట ధారాసారంగా వర్షపాతం! ఇంట్లో భక్తుని హృదయమేఘం కరిగి కన్నీళ్లుగా ప్రవహిస్తూ ఉంది. స్వామివారు చిరుదరహాసంతో చిద్విలాసంగా చూస్తూ, ఎందుకు దుఃఖిస్తావు? ఒక తండ్రి, ఒక కుటుంబపెద్దగా, తన బిడ్డలసంరక్షణభారం వహించడంలో ఆశ్చర్యమేముంది? నీవిక నిశ్చింతగా ఉండు. ఆపద గడచిపోయింది కదా! ఇక, దుఃఖించకు, నేనిక వెళ్లివస్తాను' అంటూ బయలుదేరాడు. ఆతిథ్యం స్వీకరించకుండా వెళ్లిపోతారా స్వామీ! ఈ పూట మా ఇంట్లో ఉండి పాయసాన్నం స్వీకరించాలి అన్నాడు నామదేవుడు. ఇంటిల్లిపాదీ అభ్యర్థనపూర్వకంగా చూశారు. కాని, స్వామివారు మరుసటిరోజు రాత్రికి వస్తానని చెప్పి అదృశ్యులయ్యారు.

తెల్లవారింది. నామదేవుని ఇల్లు ఎప్పటిలాగే కట్టుదిట్టంగా ఉంది. మరి నిన్నటి రాత్రి ఉన్న పరిస్థితికి, ఇప్పటికీ ఎంత భేదం! అంతా పాండురంగనాథుని అనుగ్రహం! అని తెలుసుకున్నాడు.

### జనాబాయి ఇంటికి పాండురంగని రాక!!

ఆ రోజు స్వామి వస్తానన్న రోజు, ఇంటిల్లిపాదికి ఒకటే సంబరం! పండుగ వాతావరణంతో రంగురంగుల ముగ్గులతో ఇల్లంత కళకళలాడుతోంది. నామదేవుని మనఃస్థితి, రాముడువస్తాడు, వస్తాడని ప్రతిరోజు ప్రతీక్షించే

**'శబరి'** మానసంలోని వేగిరం కనబడుతోంది. 'జ్ఞానగోపిక' జనాబాయి అంతవరకు ఇంటిపనుల్లో సాయపడి, సాయంత్రం దీపాలు పెట్టే వేళ తాను దీపం వెలిగించి, పాండురంగని విగ్రహానికి పూలదండ వేసి నామసంకీర్తనం మొదలు పెట్టింది. మూడు స్థాయి భేదాలతో ఆమె పాడే పాట శ్రోతల మనస్సును మంచులా కరిగించి ఆర్ద్రతను, మార్దవాన్ని, భక్తిరస పారవశ్యాన్ని కల్గిస్తూ ఉండగా, అరమోడ్పు కళ్ళతో ఆమె వద్దకు వచ్చి కూర్చున్నారు.

చీకట్లు ముసురుకున్నాయి కానీ, నల్లనివాడు పద్మనయనంబులవాడు రాలేదు! ఒకరి మొహాలు ఒకరు చూచుకోసాగారు. జనాబాయి ఒక సంకీర్తనం అందుకొని రాగాలాపన చేయడం ప్రారంభించింది. తక్కిన వారందరూ ఆమెతో గొంతు కలిపారు. ఉన్నట్టుండి ఓ మెరుపుతీగ తళుకున మెరసినట్లయింది. అందరు అటుచూడగా స్వామి పీతాంబరధారియై, నానావిధ భూషణాలంకృతుడై, పుండరీక వరదుడు చిరునవ్వు చిందిస్తూ చిద్విలాసంగా నిలబడి ఉన్నాడు. అందరూ భక్తితో మోకరిల్లి దండాలు పెట్టారు.

స్వామివారికి అభ్యంజనస్నానాలు వేడి వేడి నీళ్లతో కానిచ్చి, ఉత్తరీయంతో ఒళ్లంతాతుడిచి, సాంబ్రాణితో ముంతపొగ వేసి, తెల్లని వస్త్రం కట్టబెట్టి, కొత్త ఉత్తరీయాన్ని కప్పి, పీఠంమీద అధివసింపజేశారు. షోడశోపచారాలతో అందరూ కలసి పూజ చేశారు. సాష్టాంగదండ ప్రణామాలతో పురుషులు, తామరమొగ్గల్లావంగిస్త్రీలు ముకుళిత హస్తాలతో ముగ్ధమనోహరులై నమస్కరించారు.

తరువాత విందుభోజనాలకు ఏర్పాట్లు జరిగాయి. నామదేవుని నలుగురు కొడుకులు, కూర్చున్న పంక్తిలోనే పండరినాథుడు కూర్చున్నాడు. తల్లి గుణాబాయి, నామదేవుడు ఒక వరుస, పండరినాథుడు రాధాబాయిని కూర్చోమన్నాడు. ఆమె పెనిమిటిని చూచి ఆయన తల ఊపితే భోజనానికి



కూర్చున్నది. ఇందరూ భోజనానికి కూర్చోగా, వడ్డించేదెవరు? అంటే ఆరేళ్ళ అమ్మాయి జనాబాయి. కారణం, భగవంతుని సహపంక్తిలో భోంచేయాలనే తపన వారినందరినీ అలా చేసింది.

జనాబాయి వడ్డన మొదలు పెట్టింది. వంటకాలు వడ్డిస్తున్న సమయంలో అనుకోని విధంగా ఒక ఆలోచన ఆమెలో కలిగింది. **తన నౌక్రదాన్ని విడిచి తక్కిన వారందరూ పండరినాథునితో కలసి భోజనం చేయడం అనౌచిత్యంగా భాసించింది.**

భోజనంలో వంటకాలన్నీ చాలా రుచికరంగా ఉన్నాయని అందరూ ప్రశంసిస్తున్నా, పండరినాథుడు మాత్రం నాలుగు మెతుకులు కొరికి ఇక చాలన్నట్లు కూర్చున్నాడు. నామదేవుడది చూచి "స్వామీ! జనాబాయి ఈ బంతిలో లేనందువల్ల మీకు అన్నం రుచించడం లేదు కదూ! అన్నాడు . దానికి పండరిప్రభువు సమాధానం చెప్పక చిరునవ్వు నవ్వాడు.

భోజన కార్యక్రమం ముగిసింది. నామదేవుడూ, సర్వనామదేవుడూ ఒక గదిలో పడుకొన్నారు. జనాబాయి మరోగదిలో పడుకుంది. నామదేవునికి నిద్రపట్టనిచ్చి పండరినాథుడు జనాబాయిగదిలోకి వెళ్ళాడు. "జ్ఞానమ్మా! నాకు ఆకలిగ ఉందమ్మా! తినడానికి ఏమైనా పెట్టవూ?" అని ఒక బిడ్డ తల్లిని అడిగే విధంగా అడిగేటప్పటికి ఆమె హృదయంలో తల్లడిల్లిపోయి, కరుణామయుడైన నీకు ఏ తినుబండారాన్ని ఇచ్చి తృప్తిపరచగలను తండ్రీ! అందరి భోజనాలయ్యాక ఏం మిగులుతుంది? అందరి ఆకలి తీర్చేవాడివి నీకు ఆకలయితే ఎలా ఉంటుందో చూచావా? ఆఁ అన్నటు జ్ఞాపకం వచ్చింది నీవు సరిగ్గా భోజనం చేయక అన్ని అలాగే వదలివేసి చేతులు కడుక్కున్నావుకదా! నీ 'భుక్తశేషాన్ని' **గుణాబాయి**గారు నాకిచ్చి దాచమన్నారు. అదొక్కటే ఉంది. 'నీ భుక్తశేషం భక్తులకు ప్రసాదం' కదా! దాన్ని మరల నీకే నైవేద్యంగ ఇవ్వడానికి వెనకాడుతున్నాను" అంది జనాబాయి.

"పరవాలేదు. నా భుక్తశేషమే తీసుకురా! అప్పుడు ఆకలికాలేదు. ఇప్పుడు ఆకలవుతున్నది. తింటాను" అన్నాడు.

## స్వామికి స్వ భుక్తశేషం - జనాబాయికి హరిభుక్తశేషం

ఆమె ఒక కంచం తెచ్చి ఆయన ముందు పెట్టింది. స్వామి, జనాబాయిని కూడా కూర్చోమన్నాడు. తనతోపాటు తినమన్నాడు. స్వామి భుక్తశేషాన్ని ప్రసాదంగా భావించి భుజించింది జనాబాయి. స్వభుక్తశేషాన్నే భుజించి స్వామి ఆకలి తీర్చుకున్నాడు.

"భగవంతుడు, భక్తురాలైన బాలిక అలా కలిసి ఒకే కంచంలోని అన్నాన్ని తింటూ ఉండటం పండరీపురనాథుని దేవేరి రుక్మిణీదేవి చూచి ఆశ్చర్యపడింది. ఎంతటివాడీ దేవుడు? ఇంత చిన్న అమ్మాయి భక్తికి లొంగిపోయి చూపిస్తున్న వాత్సల్యం చూచి తీరవలసిందే తప్ప ఏమని వర్ణించేది? అనుకున్నది. ఇంతలో **గుణాబాయికి** మెలకువ వచ్చింది. పసిపిల్లతో కలిసి దేవుడు ఒకే కంచంలోని అన్నాన్ని తినడం విడ్డూరంగా చూచి, మెల్లగా కొడుకు **నామదేవుణ్ణి** లేపి ఆ దృశ్యాన్ని చూపించింది. దానికాయన, ఔనమ్మా! ఇందులో వింత ఏముంది? భగవంతుడు భక్తపరాధీనుడు కదా! రామావతారంలో వృద్ధ శబరి ఇచ్చిన ఎంగిలిపండ్లు తినలేదా? బాలకృష్ణుడుగా అడవుల్లో ఆవుల్ని కాచేటప్పుడు తోటి గోపబాలురతో కలిసి, వారి మధ్య కూర్చుండి చద్ది అన్నాన్ని ఊరగాయతో నంచుకొని అందరి ఎంగిళ్ళు కలిసిన ఆ భోజనం చేశాడే! దానికేమంటావు? గోపికలందరితో కలసి బాలకృష్ణుడు వేడి వేడి చక్కెరపొంగలిని మోచేతులదాకా నెయ్యి కారుతుండగా జుర్రుకొని తినలేదా? ఇదేమంత విడ్డూరం! 'హరి భుక్తశేషాన్ని భక్తులు ప్రసాదంగా స్వీకరించడం రోజూ జరుగుతున్నదే! **ఇక్కడ విశేషమేమంటే, హరి తన భుక్తశేషాన్ని తాను ఆరగిస్తూ, భక్తురాలికి హరిభుక్తశేషాన్ని అనుగ్రహించే నెపంతో తానూ**



**ఎంగిలిపడడం. జీవాత్మ పరమాత్మల భార్యాభర్తృ సంబంధాన్ని స్థాపిస్తూ ఉంది.** జనాబాయి **'జీవాత్మ'** – పండరినాథుడు **పరమాత్మ**తో సయ్యాటలాడుతున్న సన్నివేశమిది! భగవద్భక్తి సామ్రాజ్యంలో ఇదేమీ కొత్త విషయం కాదు. **'పరమాత్మ' ఒక బాలునివలె ప్రవర్తిస్తున్న సన్నివేశమిది. స్త్రీపురుష వివక్ష కిక్కడ తావులేదు. వయో తారతమ్యానికి చోటులేదు. అసలు ఆ దృష్టితో చూడ కూడదు. "పుమాన్ విష్ణురితి ఖ్యాతః స్త్రీ ప్రాయం ఇతరం జగత్" –** విష్ణువు ఒక్కడే పురుషోత్తముడు. 'సృష్టిలో తక్కినవన్నీ స్త్రీతో సమానం" అని దీనికర్థం అన్నాడు నామదేవుడు. భోజనాలైన తర్వాత ఎవరి మంచాలమీద వారు పడుకొన్నారు.

## తిరగలిపై పిండితాను విసురుతుంటే జనాబాయిని పాటలు పాడమని విఠ్ఠలుడు కోరడం

రాత్రి నాలుగో జాము అయింది. పండరినాథుడు మళ్ళీ పక్కమీదనుండి లేచాడు. జనాబాయిని నిద్రలేపాడు. చిన్న పిల్ల గనుక ముఖాన్ని నీళ్ళతో తుడిచి కూర్చో బెట్టాడు. "గోపెమ్మా! నీవు రోజు తిరగలిలో పిండి విసిరేటప్పుడు నా మీద పాటలు పాడుతుంటావు కదా! ఆ పాటలునాకు వినాలని ఉంది. తిరగలికి ఒక వైపు నీవు కూర్చో, నీకు ఎదురుగా నేను కూర్చుంటాను. తిరగలిపిడి మీద నీవు చేయి ఆనిస్తే చాలు! పిండి నేను విసురుతాను. నువ్వు పాడుతూ ఉంటే నేను వింటూ ఉంటాను. సరేనా! అన్నాడు. ఆయన చెప్పిన తరువాత దానికిక తిరుగేముంది?

తిరగలి తిరుగుతూనే ఉంది. ధాన్యం జనాబాయి తిరగలిలో వేస్తూ ఉంది. పాటమీద పాట పాడుతూనే ఉంది. సన్నని కమ్మచ్చు తీగలాగా ఉన్న కంఠస్వరంతోగుండె లోతులనుండి త్రవ్వుకొని వస్తున్న దుఃఖానికి జీవగత ఆర్తికి సంగీతరాగాల ముసుగు తొడిగి గమక చమత్కారాలతో ఆనందాన్ని కల్గిస్తూ తన భక్తిని, ఆర్ద్రతామయం చేసి సంగీత లోకాల్లో

విహరిస్తూ ఉంది. ఆమె కళ్ళముందు సర్వాలంకార భూషితుడైన పీతాంబరధరుడే పిల్లనగ్రోవి పట్టుకొని వేణుగానం చేస్తున్నాడు. మురళీధరుడు, వేణుగోపాలుడు ఆమెకు ఇష్టదైవం!

నామదేవుని తల్లి గుణాబాయికి మళ్ళీ మెలకువ వచ్చింది. "జనాబాయీ! ఇప్పుడేమిటమ్మా! అర్ధరాత్రి పాటలు పాడుతున్నావు. పాటపాటకు మధ్య ఆ మాటలేమిటి? ఎవరితో మాట్లాడుతున్నావు? నీతో కలిసి పిండి విసురుతున్న దెవరు? ఈ వేళప్పుడు ఎవర్ని తీసుకొచ్చావే" అని గట్టిగా గద్దించింది.

జనాబాయి దానికి సమాధానం చెప్పలేదు.

"నేనమ్మా! కృష్ణాబాయిని. పక్కింటి వారి అమ్మాయిని. నిద్రపట్టడం లేదని, జనాబాయి పాటలు విందామని వచ్చాను" అంటూ సమాధాన మిచ్చాడు పండరినాథుడు. ముసలామెకు నమ్మకం కలగలేదు. లేచి వచ్చి గుమ్మంలో నుంచి చూచింది. కృష్ణాబాయి రూపమే కన్పించింది. ఆమెకు, ఇంకేం సరేలే! అంటూ విసురుగా గదిలోకి వెళ్ళి పడుకుంది.

ఆ తర్వాత జనాబాయి మళ్ళీపాటలు పాడసాగింది. ఈసారి నివృత్తిదేవుడు, జ్ఞానదేవుడు, సోపానదేవుడు, ముక్తాబాయి, గోరాకుంభార్ వంటి భగవద్భక్తుల ఘనతను కీర్తిస్తూ పాటలు పాడింది.

### సూర్యోదయాత్పూర్వం దధిమథనం సృష్ట్యాదిలోని క్షీరసాగరమథనానికి ప్రతీక!

జనాబాయి పాటలు పాడడం ఆపి, 'విట్యూ! చాల రోజులుగా నన్ను వెంటాడుతున్న ప్రశ్నలు రెండు. ఒకటి – ప్రతిరోజు సూర్యుడుదయించక పూర్వమే ప్రతి ఇంట్లో పెరుగు చిలికి వెన్న తీస్తారు. ఎంతో కష్టపడి తీసిన ఆ వెన్నెను నీవు అవలీలగా దొంగిలిస్తావు. ఏమిటి ఈ రహస్యం? రెండవ



ప్రశ్న – ప్రతిరోజు మధ్యాహ్నం పూట తిరగలిపై పిండి విసరడం – ఇవి రెండూ నాకు అర్థంకాని రహస్యాలు. నీవే దానికి అర్థం – అంతరార్థం చెప్పాలి."

అడగవలసిన ప్రశ్నలే అడిగావు జనా! భారతదేశంలోని ప్రతి పల్లెటూరిలో సూర్యుడుదయించక పూర్వమే పెరుగును కవ్వంతో చిలికి వెన్న తీసి దాచిపెట్టుతారు. ఇది మన గ్రామీణజీవన సౌందర్యమనే మాట అటుంచి, బ్రాహ్మీముహూర్తంలో కాలానికుండే శక్తిని తెలుసుకున్న మన ఋషులు, వాటి సామర్థ్యాన్ని తెలివిగా ఎలా సద్వినియోగం చేసుకొన్నారో దీన్నిబట్టి చెప్పవచ్చు. సూర్యోదయాత్పూర్వం అంటే సృష్టికి ఆద్యవస్థ! అప్పుడు క్షీరసాగరమథనం జరిగింది. దధిమథనం దానికి ప్రతీక! నిజానికి మన హృదయంలో నిత్యమూ క్షీరసాగరమథనం జరుగుతోంది. ఇదొక నిరంతర ప్రక్రియ! దధిమథనంలో వచ్చే నవనీతం సహృదయ హృదయానికి ప్రతీక! సూర్యోదయం అయ్యాక పెరుగు చిలికితే సరిగ్గా వెన్నపడదు. ఇది కాలానికి చెందిన అంశం. మన ఋషులు కాలజ్ఞాన సంపన్నులు.

మానవ జీవితమే తీసుకుందాం. **బాల్యం** – పాలు (పాలు తాగే దశ), **కౌమారం** – పెరుగు (పెరిగే దశ), **యౌవనం** – వెన్న (జతగూడే దశ), యువతులైన గోపెమ్మలు పెరుగుచిలికి వెన్న తీస్తారు. భగవంతుడు కూడ పరిపక్వమైన సారాన్నే గ్రహిస్తాడు. పెరుగునుండి వెన్న, వెన్న కాస్తే నెయ్యి, ఇక్కడ వెన్న యౌవనానికి ప్రతీక. కన్యాత్వం. నెయ్యి వైవాహిక దశ. మాతృత్వం. శ్రీకృష్ణుడు శిశువు. కన్యాత్వదశలోని గోపికలకు వారుతీసి దాచిపెట్టిన వెన్న దొంగతనం చేయడం ద్వారా మాతృత్వ భావనను కల్గిస్తున్నాడు. కన్యలో నిక్షిప్తమైన మాతృత్వ దశవిశేషాన్ని వెలికి తెచ్చేవాడు శిశువు. అదే కృష్ణుని వెన్న దొంగతనం! వెన్న దొంగ అంటే **'మానినీ చిత్త చోరు'**డని అర్థం. (ఇది రుక్మిణీదేవి పెట్టిన పేరు)

భౌతిక జీవితంలో ప్రతి ఒక్కరూ కోరేది. ''యత్సారభూతం తదుపాసితవ్యమ్'' తనకేది లాభమో దాన్నే ఆశిస్తారు. తనకు లాభమై ఇతరులకు రెండింతలు నష్టం జరగాలి. పెరుగునుండి వెన్న. వెన్న కాచితే నెయ్యి. ఏది తీసుకోవాలి? తాను వెన్నతీసుకుంటే దానివల్ల గోపెమ్మలకు ''వెన్నకు వెన్నాపోయె, నెయ్యికి సున్నాచుట్టె'' అన్నట్లయింది. రెంటికి చెడినరేవడి కావాలి. పిల్లికి చెలగాటం! ఎలుకకు ప్రాణసంకటం! ఆయన కిష్టమైంది! మనకు కష్టం! నష్టం! భౌతిక జీవితంలో యౌవనంలాంటి వెన్నను ప్రతిరోజు కోల్పోయి గోపెమ్మలు దుఃఖిస్తే స్వామికి ఆనందం! (బడుగు జీవుల కడగండ్లు చూచి బాలకృష్ణుడు చిలిపి చేష్టలు చేసి నవ్వుకొన్నాడు. తర్వాత వారిని వివాహమాడి, సంతాన మనుగ్రహించి, ఉద్ధరించాడు కదా! అది వేరే విషయం). ఇక్కడ శృంగార అధ్యాత్మ విషయాల సంగమం! వెన్న – నేయి అనేవి కన్యాత్వ – మాతృత్వాల సంధికాలం. వెన్న – నేయిగా మారకముందే దాన్ని తస్కరించే కృష్ణుడు కన్యల చిత్తచోరుడు. అంతఃకరణ చతుష్టయంలో చిత్తం గరిష్ఠం. చిత్తశుద్ధిగల గోపికలు కృష్ణుని వలచారు. దానికి బాహ్యరూపం – నవనీతచోరత్వం. కృష్ణుడు వారి యౌవనానికి ప్రతీకయైన వెన్నను – అతికష్టంమీద యౌవనంలా దాచి పెట్టుకొన్న వెన్నను అపహరించాడు. దీనినే పోతన **''మానినీ చిత్తచోర''** అని రుక్మిణి చేత చెప్పించాడు. ఇది బాలగోపాలుని లీల విశేషాల్లో ఒక మధురభక్తి ఘట్టం!

### తిరగలి తత్త్వం సృష్టిరహస్యమని జనాబాయికి చెప్పిన పండరినాథుడు

ఈ తిరగలి తత్త్వమేమిటని కదా అడిగావు? చెబుతా విను. ''రెండు వర్తులాకారపు దళసరి రాళ్లేమిటి? క్రిందిరాయి కదలదు. పైరాయి గుండ్రంగా తిరుగుతుంది. ఈ రెండు రాళ్లమధ్య నలిగి ధాన్యం పిండి కావటమేమిటి! ఏమిటి దీని తత్త్వం? అని కదా నీ సందేహం!

తిరగలి తత్త్వంలో సృష్టిరహస్యం దాగి ఉంది. తిరగలి క్రింద ఉన్న రాయి కదలదు. అది స్థిరం (STATIC) **సృష్టిలో కూడా ఒక స్థిరమైన తత్త్వముంది. దానిపేరు శివుడు. అందుకే శివసహస్రనామాల్లో మొదటిపేరు** '‹ Ë¡,Uk ‹ Ë¡ ³Ø ` Çæ ¶ ^ ¥ ß''ª Ðº= ÑÙ < Œ ¡. శివునికి 'స్థాణువు' వాని పేరు. **(''స స్థాణుః స్థిరభక్తియోగ సులభో....''** అని మహాకవి కాళిదాసు అంటాడు. )



తిరగలి పైనున్న రాయి గుండ్రంగా తిరుగుతుంది. **చలన శీలమైన పైనున్నరాయి విష్ణువు** (DYNAMIC). ఈ రెండు వృత్తాలు అనాది తత్త్వ ప్రతీకలు. పంచాగ్ని రూప ప్రపంచం విష్ణుమయం. అతడే మహాక్రతుమూర్తి. **''అయం యజ్ఞో భువనస్య నాభిః''** ఈ యజ్ఞమే పద్నాల్గు లోకాలకు బొడ్డు. క్రింద ఉన్నరాయికి బొడ్డు భాగంలో ఒక కొయ్య అమర్చబడి ఉంటుంది. **నాభీస్థానం** యజ్ఞమైతే, **కొయ్య** – యూపస్తంభం. ఈ రెండు రాళ్ల మధ్య జరిగేదే యజ్ఞం! ఇదే సమస్త జగత్తుకు నాభి. **'గచ్ఛతీతి జగత్'** అన్నారు. **విష్ణుసహస్రనామాల్లో మొదటిపేరు 'విశ్వం'.** అంటే **జగత్తు,** వ్యక్తతత్త్వం – కనబడే తత్త్వం పేరు విష్ణువు. **అవ్యక్తతత్త్వం – కనబడనిది – దానిపేరు శివుడు. ''అవ్యక్తమనగ బ్రహ్మంబునా శివంబన వినుతి కెక్కి''** (మహాభారతం – శాంతిపర్వం. 5–345) శివుడు విశ్వానికి ఆధారం. అవ్యక్తం – స్థాణువు. దానిపై కదిలే తత్త్వం – విష్ణువు. జగత్తు. పంచాగ్ని విద్యారూప ప్రపంచం. ఇలా వ్యక్తావ్యక్త సమన్వయమే తిరగలి. ఇది దీని నిర్మాణ రహస్యం.

తిరగలిలో వేయబడే ధ్యానపు గింజలే జీవసృష్టి పరంపర. ధాన్యపుగింజగాని, జీవుడుగాని పంచాగ్ని విద్యారహస్యం నుండి పుట్టినవారే. అవి తిరగలిలో తిరిగి తిరిగి నలిగి నలిగి పిండిగా పరిణామాన్ని పొందడమే. కాలచక్రభ్రమణంలో జీవుడు పొందే మార్పు. జీవుడు జీవితంలో డక్కామొక్కీలు తిని, రాటుదేలి, 'ఇదిగో నేను' అనే వ్యక్తిత్వముద్రను నిరూపించుకోవాలి. ఈ వ్యక్తిత్వ నిర్మాణ వికాసానికి దోహదం చేసేదే కాలగతిలో ఏర్పడే విషమ పరీక్షలు.

పైనున్న తిరగలిరాయికి పైన ఒక కొయ్య ముక్క అమర్చబడి ఉంటుంది. దాన్ని పట్టుకొని తిప్పాలి. అదే **కాలచక్రం.** దాన్ని తిప్పేవాడు విష్ణువు. జనాబాయి కథలో ఆమెను పాట పాడమని పాండురంగడు తిరగలి తిప్పాడు. తత్త్వం సరిగ్గా సమన్వయమైంది. **"కాలచక్రము నిర్వికల్పముగాగ నేన నయింతు" (మహాభారతం) "తస్మై కాలాత్మనే నమః."** కాలచక్రం తిప్పే చక్రధారి, చక్రపాణి పాండురంగడు. ఈ విధంగా జనాబాయికి తిరగలి తత్త్వంలో సృష్టిరహస్యం దాగివుందని వ్యాఖ్యా పూర్వకంగా వివరించాడు. చివరగా, తత్త్వమొకటే కదా! రెండెందుకు? అంది జనాబాయి. ఏకైక తత్త్వమే నిజం! కాని అది ఎవ్వరికీ కనబడదు. స్త్రీ పుంరూపాత్మకమైనది జగత్తు. ఆధ్యాత్మికంగా వారు శివుడు – విష్ణువు. భౌతిక జగత్తులో స్త్రీ పురుషులు. తిరగలి తత్త్వంవలె జగత్తు ద్వంద్వాత్మకమైంది." అన్నాడు పాండురంగడు. ఇదే తిరగలిపాట! ప్రతిరోజు తిరుగుతూ తిరగలి పాడే పాట!"

## భక్తురాలికి విషమపరీక్ష

పిండివిసరడం పూర్తయింది. శ్రీహరి లేచి వెళ్ళి తన పక్కమీద పడుకున్నాడు. జనాబాయి తన గదిలో పడుకుంది. కాసేపు కునుకు పట్టిందో లేదో – ఎక్కడో కోడి కూసింది. జనాబాయి లేచి వెళ్ళి స్వామిని నిద్రలేపింది. "స్వామీ! తెల్లవారబోతోంది. కాస్సేపట్లో మిమ్మల్ని అర్చించడానికీ, దర్శించడానికి ఎందరో భక్తులు మీగుడికి వచ్చి కాచుకొని ఉంటారు. ఇక లేవండి" అంది. పండరినాథుడు తడబడుతూ లేచాడు. జనాబాయి గదిలో కన్పించిన ఓ పాతచీర ఒకటి కట్టుకొని, తన పీతాంబరం నగలన్నీ మూట గట్టి గదిలో ఓ మూలలో పెట్టి హడావుడిగా గుడికి వెళ్లాడు.

సూర్యోదయమైంది. అర్చకులు దేవాలయం తలుపులు తెరిచారు. గర్భగుడి తలుపులు తెరచిచూస్తే ఏముంది? స్వామివారు పీతాంబరాన్ని కాక పాత చీర నొకదాన్ని కట్టుకోనున్నాడన్నది స్పష్టమైంది. ఒక్క ఆభరణం



కూడ ఒంటిమీద లేదు. మళ్లీ ఆశ్చర్యపోవడం అర్చకుల వంతయింది. అది జనాబాయి చీర అయి ఉండవచ్చని ఎవరో సందేహం వెలిబుచ్చారు. అంతే, వెంటనే అర్చక బృందం నామదేవుడి ఇంటికి వెళ్ళారు. జనాబాయిని విచారించగా ఆ చీర తనదేనని, నగలసంగతి తనకు తెలియదంది. వచ్చిన వాళ్లు ఇంట్లోకి చొరబడి, పెట్టే బేడా, మూటాముల్లే అన్నీ శోధించారు. జనాబాయి గదిలో ఓ మూల నగలమూట బయటపడింది. జనాబాయి అవెలావచ్చాయో తెలియక తెల్లబోయింది.

అర్చకులు పురపాలకాధికారికి ఫిర్యాదు చేశారు. ఆమె చీర తనదేనని నగల సంగతి ససేమిరా తనకు తెలియదన్నది. భగవంతుని ద్రవ్యాన్ని అపహరించినందులకు బహిరంగ ప్రదేశంలో శూలం వెయ్యాలని శిక్ష విధించారు. శూలం వెయ్యడమంటే **'శూలప్రోతమ'**ని అర్థం! ఇది మహాభారత కాలంలో అమలులో ఉన్న శిక్ష! మాండవ్యమునిని దొంగల నాయకుడని ఆ ఊరి రాజుగారు **శూలప్రోత**మనే శిక్ష విధించారు. దీన్నే తెలుగులో **కొఱత వేయడం** అంటారు. ఒక పెద్ద ఇనుప కమ్మిని చివర బొడిపె వచ్చేట్టుగా చేసి ఉంటారు. దాన్ని నిలబడేట్టు నేలలో పాతి, నేరస్థుడిని /నేరస్థురాలిని ఆ బొడిపె భాగం గుదభాగంలో దిగేట్లు నిలువుగా దింపుతారు. పై బొడిపె భాగం కంఠంగుండా శిరస్సు మాడుభాగాన్ని చీల్చుకొని పైకి వస్తే చాలు, ఆ వ్యక్తి మరణించినట్లే లెక్క! ఇటువంటి ఘోరశిక్షలు ఒకప్పుడు అమలులో ఉండేవి. **'ఆణి'** (చీల) గుదభాగంలో నిలిచిపోవడం వల్ల తక్కిన ఇనుపకడ్డీని కోసి వేరుచేశారు. అందుకే భారతకథలోని మాండవ్యునికి **'ఆణి మాండవ్యుడనే పేరు ఏర్పడింది.** (చూ॥ ఆదిపర్వం – నన్నయభట్టు)

ఇటువంటి ఘోరశిక్ష ఆరేండ్ల చిన్న బాలికకు వేయవచ్చునా? అన్న ఇంగిత జ్ఞానం కూడ లేకుండా శిక్ష విధించారు. జనాబాయి ఉలుకలేదు పలుకలేదు. నిమ్మకు నీరెత్తినట్లు నిమ్మళంగా ఉంది. మనసంతా భగవన్నామస్మరణతో నిండి ఉంది. ఆమెను లాక్కెళ్ళి శూలం దగ్గర

నిలబెట్టారు. అంతే తక్షణమే ఆ శూలం కాలి బూడిద అయింది. మరో శూలాన్ని దగ్గర పెట్టారు. అదీ అట్లే అయింది. ఇక లాభంలేదని పురపాలకాధికారి ఆమె పాదాలపై బడి "**అమ్మా మీరు మహాభక్తులు!** మీరే చెప్పండి! మమ్మల్ని ఏం చేయమంటారు" అనడిగాడు. "నగల విషయం స్వామివారినే అడగండి" అంది. "అది మాకు అసాధ్యమైన కార్యం" అన్నాడు. ఇంతలో గుడిగంటలు మోగాయి! గర్భగుడిలోని అర్చకుడు పరిగెత్తుకుంటూ వచ్చాడు. అతని ముఖతః స్వామివారిలా పలికారు! "ఓయీ! అధికారీ! ఇది నేను జనాబాయికి పెట్టిన చిన్న పరీక్ష! ఆమెకు వస్తువ్యామోహమున్నదో లేదోనని పరీక్షించాను. ఆమె బంగారునైనా మట్టితో సమానంగా చూడగల వైరాగ్యవంతురాలు! ఆమె పరీక్షలో నెగ్గింది. ఆమె నిర్దోషి! నేనే ఆ నగలమూటను వాళ్లింట్లో ఉండేట్లు చేశాను. ఆమెను నిర్దోషిగా క్షమించి వదలివేయండి" అని అర్చక ముఖసందేశం.

పండరీపురంలో ప్రజలందరు శ్రీస్వామివారి పలుకులు విన్నారు. ఆనంద, ఆశ్చర్యాలతో తలక్రిందులయ్యారు. ఆమె తల్లి తండ్రులు, మన, జనా, ఎంతో ఎత్తుకెదిగింది! ఆమె కీర్తి ప్రతిష్ఠలు మహారాష్ట్రమంతా వ్యాపించింది అని ఆనందించారు.

### సంత్ శిరోమణి శ్రీజ్ఞానేశ్వర్ మహారాజ్‌గారి ఆగమనం

నామదేవుని గురువు సంత్ శిరోమణి శ్రీజ్ఞానేశ్వరులు పండరీపురానికి వచ్చారు. నామదేవులు పండరీపురంలో ప్రతియేటా **నామసప్తాహమహోత్సవాలు** జరుపుతూ ఉండడం దానికి ప్రధానకారణం. జనాబాయికి దుఃఖం, చింత, వ్యాకులపాటు ఏకోశానా లేవు. నామదేవుని ఇంటివాకిట్లో కూర్చొని కరుణామయుడైన పండరినాథుని గుణగానం చేస్తున్నది. అవి ఆర్ద్రతామహితాలై హృదయంలోని ఆర్తినీ, జీవగత దుఃఖాన్ని క్షాళితం చేస్తున్నాయి. ఆ పాటలు అనిదంపూర్వాలు కావడం చేత, గుడిలో



పండరినాథులు గంటం పట్టుకొని తాటి ఆకులపై వ్రాసుకుంటున్నారు. ఆ సమయంలో గుడికి జ్ఞానదేవుడు శిష్యుడు నామదేవసహితుడై వచ్చాడు. స్వామి నిశ్చలంగా జనాబాయి పాటల్ని తాటాకులపై వ్రాస్తున్నారని గ్రహించాడు. జ్ఞానదేవుని రాకను గమనించక పోవడంవల్ల, వెంటనే వ్రాయడం ఆపి ఉత్తరీయం మరుగున దాచారు! స్వామీ! నా వద్ద దాపరికమా? అన్నాడు జ్ఞానదేవుడు. పండరినాథుడు చిరునవ్వునవ్వుతూ, మీ శిష్యుడు నామదేవుని ఇంట్లో కూర్చొని జనాబాయి పాడుతున్న పాటలివి! వాటి ఆర్ద్రతకు వ్యాముగ్ధుడనై ఉండలేక ఎత్తి వ్రాసుకుంటున్నాను. ఆమె పాటలు నా గురించి నాకే తెలియజేసే విధంగా ఉండడం. ఆశ్చర్యకరంగా ఉంది" అన్నాడు. జ్ఞానదేవుడు అద్భుతానందానికి లోనయ్యాడు. ఇంతలో జనాబాయియే స్వామిని చూడాలనే తీవ్రకాంక్షతో గుడిలోపలికి వచ్చింది. కుటుంబ సభ్యులందరూ ఆమెను అనుసరించారు.

అందరూ ఆమె వైపేచూస్తున్నారు. జనాబాయి అక్కడ జ్ఞానేశ్వరునికి, నామదేవునికి మొదట నమస్కరించి, "పాండురంగా! పండరినాథా! మీ సన్నిధిలో ఒక పాటపాడుతాను. నాదైన జీవిత చరమకాంక్షను నెరవేరుస్తావా! నాకీ ప్రాపంచిక జీవితంపట్ల విరక్తి, వైరాగ్యం మిన్ను ముట్టింది. నీ పాదారవిందాలు తప్ప నాకేమీ కనబడడంలేదు. నా జీవుని వేదనను మీరే అర్థం చేసుకోగలరు. మీపద పంకజ రేణువుగా నన్ను స్వీకరించి ధన్యురాలిని చేయాలని ప్రార్థిస్తున్నాను స్వామీ! అని చివరిపాట పాడింది.

స్వామివారు "ఓ జ్ఞానగోపికా! జనాబాయీ! ఆర్ద్రమైన భక్తి నీ సొమ్ము! స్థిరభక్తియోగ సులభుడైన నన్ను నీ అచంచల అనన్య భక్తియోగంతో, కట్టిపడేశావు. హృదయగత ఆర్తిని పాటలుగా సంగీతరాగాలతో రంగరించి నీ పాండురంగడైన నన్ను ఆకట్టుకున్నావు. కారణజన్మురాలివైన నిన్ను స్వీకరిస్తున్నాను. నీవు కోరినది నీకు సిద్ధించుగాక!" అన్నాడు.

జనాబాయి పండరీనాథుని గర్భగుడిలో ప్రవేశించి అంతర్ధానమయింది. వెంటనే స్వామి పాద సన్నిధిలో ఒక పద్మం వెల్లివిరిసింది. సుగంధాలు నలుదిక్కులా ప్రసరించాయి. గోదాదేవిలాగ జనాబాయి గాన కైంకర్యంతో అచంచల యోగసాధనతో ముక్తి పొందిన బాలయోగిని.

జనాబాయి జ్ఞానేశ్వరులకు (1275 - 1296), ఆయన శిష్యుడు నామదేవులకు (1220 - 1350) సమకాలికురాలు. జనన నిర్యాణాల కాలం కచ్చితంగా తెలియదుగాని, ఆరేండ్లు మాత్రమే ఆయుర్ధాయం గల్గి, కర్మశేషాన్ని తొలగించుకొని, కృష్ణైక్యం పొందిన 'జనాబాయి అనే జ్ఞానమ్మ ఒక గోపికావిరహ భక్తికి తార్కాణగా నిలుస్తున్నది. అది మధురభక్తి మార్గం. నిగూఢమైన జీవాత్మ - పరమాత్మల శృంగార తత్త్వమే మధురభక్తి! ఆమెది మూఢభక్తికాదు. ముగ్ధభక్తి అంతకంటే కాదు. ఆమె ఒక భ్రష్టయోగిని! తన యోగసాధనలో మిగిలిపోయిన సాధనను పూర్తి చేసుకోవడానికై పుట్టిన కారణజన్మురాలు! మహాభక్తురాలు! వాగ్గేయకారిణి!

అంతవరకు తల్లితండ్రులకు, నామదేవుల కుటుంబానికి మన ముద్దుబిడ్డగా ఉన్న జనాబాయి అనే ఆరేండ్ల బాలయోగిని జనముద్దుబిడ్డగా అందరి మన్ననలు పొంది జనాబాయిగా ప్రఖ్యాతిపొంది పండరీపురనాథుని భక్తి సామ్రాజ్యంలో ఒక చిరస్మరణీయమైన భక్తగోపికగా చిరస్థాయిగ వెలిగింది!

* * *

## 5. ఛోకామిళా

### (క్రీ.శ.1300-1400)

**చండాలోఽస్తు సతుద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ ॥**

**- శ్రీ ఆదిశంకరభగవత్పాదుల మనీషాపంచకమ్**

పండరీపురానికి సమీపంలో ఉన్న 'మంగల్‌వేఢే' గ్రామంలో ఛోకామిళా లేక ఛోకామేళా అనే పేరుతో 'మహార్' అనబడే (మాల, మాదిగ, చండాలురనే అంత్యజుల్ని 'మహార్ అని పిలుస్తారు.) చండాలుడుగా పుట్టిన భక్తుడుండేవాడు. అతడు కులాచారంగా సంక్రమించిన వృత్తులలో తన జీవికకు, వ్యక్తిత్వానికి భంగం కల్గించేవాటిని వదలి, సాధారణ జీవితానికి ఉపయోగపడే పనుల్ని మాత్రమే స్వీకరించి తక్కిన సమయంలో భగవద్ధ్యానంలో పొద్దుగడుపుతూ ఉండేవాడు. అది చూచి తోటి చండాలురు "ఛోకామిళా! ఇదేమి పనిరా! మన జాతికి చెడ్డపేరు తెస్తున్నావు గదరా! కల్లు తాగితే కలిగే ఆనందంకంటే, ఎవరో దేవుణ్ణి కొలిస్తే కలిగే ఆనందం గొప్పదా! అని ఎప్పుడూ విమర్శిస్తూ ఉండేవారు. ఒక్కొక్కసారి విసుక్కుంటూ, ఒక్కొక్కసారి గొణుక్కుంటూ "వీడెప్పుడూ ఇంతే! ఏంచేసినా మారడు! అదోరకం మనిషి" అని నానావిధాలుగా దుర్భాషలాడుతూ ఈసడించేవారు.

ఛోకామేళుని భార్య మనస్తత్త్వంలో భర్తకు తగినదే కాని, అప్పుడప్పుడు ఆయన స్నేహితులు చెప్పేమాటల్లోని న్యాయాన్ని గ్రహించి, "నిజమే కదా! మనం అందరిలాగా ఉండాలికదా! ఊరంతా ఒకదారి ఉలిపికట్టె దొక దారి" అన్నట్లుంటే, రేపు ఏదైనా ఆపద సంభవిస్తే మనల్ని ఈ అడవిలో ఆదుకొనే నాథుడెవడు? నేస్తగాళ్లందరితో కలసిమెలసి ఉండక భార్యాబిడ్డలతో హాయిగా పొద్దుగడవక, ఎవరితోను తనకు సంబంధం లేదన్నట్లు అడవుల్లో చెట్లక్రింద అస్థిపంజరాలై గడ్డాలు, మీసాలు పెంచుకున్న మునీశ్వరుల్లాగా కండ్లుమూసుకుని, ఇంట్లో వచ్చేవారెవరో, పోయేవారెవరో తెలియక ఏకాంతవాసం చేయడం ఎవరికోసం? అని తనలో తానే వితర్కించుకొని, ఒకరోజు భర్త ఛోకామేళాతో ఇలా అన్నది -

"ఏమయ్యా! మన కొలము సాములు కాట్రేడు, కాటేరి, రక్తకాటేరి, మహాంకాళి, భద్రకాళి ఇలా ఎందరెందరో ఉండగా నీవు కొత్తగా ఏ కొలము దేవరను పొద్దస్తమానమూ కొలుస్తా ఉండావు? మనకులపోళ్లు చేసే ఎగతాళి మాటలు నీకు తెలియలేదా? అర్థంకాలేదా? పోనీ, వినబడలేదా? వేరే కులపోళ్లదేవుళ్ల సంగతి మనకెందుకయ్యా! మన కులవృత్తి మనం సాగించుకుందాం! మనం ఎవ్వరికీ అన్యాయం సేయకుండా ఉండితే, దేవుడుండేచోటికి చేరుకోలేమా? ముందుగా నా మాటలు వినయ్యాసామీ! అందరూ వెళ్లేదారే మనదారి! నీ దారికెవరూ రారు. మన కులపోళ్ల పెద్దలు చెప్పిన దారిలో పోదాం! మనదారి వేరైపోతే దిక్కులేనివాళ్లమవుతాము. నీవు పరిశుద్ధంగా ఉండాలంటావేమో! శుచిగా నీవు మూడు పూటలా స్నానంచేయి! ఆ బ్యాపనోళ్ల దేవుళ్ల సంగతి నీకేం తెలుసు? అసలు నీకు ఆ దేవుళ్లను కొలవమని చెప్పిందెవరు?" అని నెత్తిన నోరు పెట్టుకొని పోరాడింది. వెలివృత్తు లెన్ని ఉన్నా, కులవృత్తికి సాటిరావని నొక్కి వక్కాణించింది.

ఛోకామిళుడు సంత్ నామదేవుని (క్రీ.శ.1220-1350) సమకాలికుడు. శిష్యుడు. నామదేవుడే ఛోకామిళుని తీర్చిదిద్ది పాండురంగని భక్తుడుగా చేసినవాడు.

తన భార్య నయానా, భయానా, చిలుకకు చెప్పినట్లు ఎన్నివిధాల చెప్పినా, 'ఛోకామిళా' వాటినన్నిటిని ఒక చెవితో విని వేరొక చెవితో వదిలివేసేవాడు. తన ఆనవాయితీ చొప్పున ప్రతిరోజు ముప్పూటలా స్నానంచేయడం, నుదుటిపై తిరుమణి ధరించడం, స్వామి పండరీపురనాథుని కోవెలకుపోయి, గుడి బయటి ప్రాకారానికి చుట్టూ ప్రదక్షిణలు చేసి, స్వామిదర్శనాన్నికోరి గోపురద్వారానికి ఎదురుగా కూర్చునేవాడు.

### అర్చకులు 'ఛోకామిళా'ను ఆలయ ముఖద్వారం నుండి వెళ్లగొట్టడం

ఇలా కొంతకాలం గడిచింది. 'ఛోకామిళా' భార్య అతణ్ణి గమనిస్తూనే ఉంది. నిట్టూర్పులు విడవడం తప్ప ఆమె చేయగలిగిందేమీ కనబడడం



లేదు. "మొక్కై వంగనిది మానై వంగుతుందా?' 'కుక్కతోక వంకర కదా!' పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతో గాని పోదు. అదే నిజం! అనుకొంది.

నిజమాలోచిస్తే, 'ఛోకామిళా' వక్రబుద్ధి గలవాడు కాడు. ఋజు బుద్ధితోనే అనన్య భక్తి భావనతోనే పండరీపుర పుండరీకాక్షుని ప్రేమిస్తున్నాడు. ధ్యానిస్తున్నాడు. తదేక ధ్యాననిష్ఠుడై ఉపాసిస్తున్నాడు. ఇంటి వ్యవహారాలను ఒకవైపు గమనిస్తూనే, తక్కిన కాలంలో పాండురంగ విఠలుని కోవెలకు నాలుగువైపులా ఉన్న ద్వారాల్లో ఏదోఒక ద్వారం వద్ద కూర్చొనేవాడు. నారాయణుని కోవెలకు నాలుగు ప్రక్కల ద్వారాలుండడం ప్రాచీన సంప్రదాయం. ఇది నాల్గు దిక్కులనుండి వస్తున్న భక్తుల్ని ఆహ్వానిస్తున్న ద్వారాలా! (లేక) నాలుగు వర్ణాలవారు మాత్రమే గుడిలోపలికి రావచ్చునని సంకేతింపబడి నిర్మింపబడిందా? అని చాల రోజులుగా ఆలోచిస్తున్నాడు ఛోకామిళుడు! మరి తాను చండాలజాతిలో పుట్టాడు గదా! చండాలుడంటే ఎవరు? నాల్గవజాతివాడు కాడా? లేక ఏజాతికిచేరని పంచముడా?

### చండాలుడంటే ఎవరు?

ఛోకామిళుని అదృష్టం బాగుంది ఆ రోజు. అతడు కూర్చున్న గోపురద్వారసోపానాలకు దిగువభాగంలో కుడివైపున ఒక పౌరాణికుడు పురాణకాలక్షేపం చేస్తున్నాడు. ఎవరో ఒక శ్రోత నాలుగువర్ణాలను గురించిన ప్రశ్న అడిగినట్లుంది. దానికి సమాధానమిస్తున్నాడు పౌరాణికుడు. అతడు మనుస్మృతిని ప్రమాణంగా గ్రహించి -

**బ్రాహ్మణ, క్షత్రియో, వైశ్యాస్త్రయోవర్ణా ద్విజాతయః ।**
**చతుర్థ ఏకజాతిస్తు శూద్రో, నాస్తితు పంచమః ॥**
**- మనుస్మృతి (10-4)**

"బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులనే మూడువర్ణాలవారే 'ద్విజులు' అని పిలువబడుతారు. ఇక నాలుగవ జాతియే శూద్రజాతి. **ఈ నాల్గు జాతులు తప్ప వేరొక్క జాతి ఐదవది లేదు"** అని మనువే మనుస్మృతిలో పేర్కొన్నట్లు చెప్పాడు.

### 'మనుస్మృతి' పుట్టుక చేత 'జాతి' నిర్ణయింపబడుతుందని చెప్పగా 'భగవద్గీత' మనిషి గుణం, చేసే పనిని బట్టి 'జాతి'ని నిర్ణయించింది

మనుధర్మశాస్త్రంలో 'జన్మ' చేత 'జాతి'ని నిర్ణయించడం చెప్పబడింది. కాని, భగవద్గీతలో మనిషియొక్క 'జాతి'ని గుణాలచేత/కర్మలచేత (గుణకర్మ విభాగశః) నిర్ణయిస్తూ శ్రీకృష్ణపరమాత్మ!

**శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణ-కర్మ విభాగశః ।**
**తస్య కర్తారమపి మాం విధ్యకర్తార మవ్యయమ్ ॥**
**- భగవద్గీత (4-13) (జ్ఞానయోగము)**

"గుణాలవలన, కర్మలవలన (లేక గుణాలయొక్క కర్మలవలన) నాలుగు వర్ణాలుగల విధానం నాచే సృష్టింపబడింది. దానికి నేను కర్తనే అయినా నన్ను కర్తను కానివానిగాను, నిర్వికారిగాను తెలుసుకో!" అన్నాడు.

**శ్లో॥ జన్మనా జాయతే శూద్రః - కర్మణా జాయతే ద్విజః ।**
**వేదాధ్యాయీ చ విప్రస్యాత్ - బ్రహ్మజ్ఞానీతు బ్రాహ్మణః ॥**

పుట్టుకతో ప్రతివాడూ శూద్రుడే. ఉత్తమ కర్మానుష్ఠానంచేత 'ద్విజుడు' రెండవ పుట్టుక కలవాడవుతున్నాడు. ఆ పిమ్మట వేదాధ్యయనం చేత విప్రుడు (శుచిర్విప్రః శుచిః కవిః - వేదం) అవుతున్నాడు. ఆ తర్వాత బ్రహ్మజ్ఞానాన్ని పొందినవాడు బ్రాహ్మణుడని పిలువబడతాడు. విప్రుడంటే వేదపండితుడు.

ఈ అంచెలంచెలుగా సోపాన పరంపరగల జీవుడు చండాలుడైనా వాడు జాతిచేత చండాలుడైనప్పటికీ గుణంచేత కర్మలచేత బ్రాహ్మణుడవుతున్నాడని శ్రీ ఆదిశంకరులు **'చండాలోஉస్తు సతుద్విజోஉస్తు గురురిత్యేషా మనీషామమ"** అన్నారు. వాడు చండాలుడైనా, బ్రాహ్మణుడైనా నాకు గురువుతో సమానం అన్నాడు. అటువంటి జ్ఞానులే సమదర్శినులు.

**శ్లో॥ విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।**
**శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః ॥**
**- భగవద్గీత (5-19) (కర్మసన్న్యాసయోగం)**



"శ్వపచుడు' 'చండాలుడు' వేర్వేరు విలోమ సంతానులైనా, పండితులు 'సమదర్శినులు' అనే సందర్భంలో విద్య, వినయం, పుష్కలంగా ఉండే బ్రాహ్మణునిపట్ల, గోవు, ఏనుగు, ఆడకుక్క, విషయంలోను, కుక్కమాంసాన్ని వండితినే 'శ్వపాకు' డనే నీచజాతివానిని వీరినందరిని సమానంగానే చూచేవాడు పండితుడు. ఇహపరాలకు చెందిన పరిపక్వమైన జ్ఞానంగలవాడే పండితుడు. **'భగవద్గీత'లో చెప్పబడిన 'గుణ, కర్మ, విభాగ వ్యవస్థ'యే వర్ణవ్యవస్థ అన్న నిర్ధయాన్నే ఈనాడు మనమందరం ప్రామాణికంగా స్వీకరించాలి! ఒక్కమాటలో చెప్పాలంటే అజామిళుడు 'వివేక భ్రష్ట సంపాతి'యైన కర్మచండాలుడు. ఛోకామిళుడు 'వివేకసోపాన పరంపర' నెక్కిన 'ఉత్తమ బ్రాహ్మణుడు' (బ్రహ్మజ్ఞాని)**

### ఛోకామీళునిది సత్యంయొక్క యథార్థ స్థితి - బ్రాహ్మణులది భౌతిక ప్రాపంచికదృష్టి

కొందరు బ్రాహ్మణులు ఈ చండాలుడు గోపురద్వారానికి అభిముఖంగా రోజూ వచ్చి కూర్చొని ఉండటాన్ని చూచి, సహించలేకపోయారు. మరుసటిరోజు అర్చకులందరినీ కూడగట్టుకొని వచ్చి, "ఓయీ! చండాలా! ఎన్నో రోజులనుండి, మేము చూస్తున్నాం. గోపుర ద్వారానికెదురుగా **'అజగరం' లాగా పండుకొని వచ్చీపోయే భక్తుల దారికి అడ్డంగా ఉన్న నీ వ్యవహారం ఏమిటో మాకు అంతుబట్టడంలేదు. ఏదోపాపం! ఆకలివేసిందేమో! భక్తులు ఆహారమిస్తారనే ఆశతో కూర్చోలేక పండుకొన్నాడనుకొన్నాం! నీవు కాసులు అడుక్కోవడం లేదు. ఆహారం స్వీకరించడంలేదని తెలుసుకున్నాము.** పోనీ, వాడికే ఒకరోజు విసుగెత్తి లేచిపోతాడులే! అనుకున్నాము. దాదాపు ఒక మండలంరోజులు గడిచాయి. నీలో కదలికలేదు. మార్పు రాలేదు. మాకు ఓర్పులేదు. నిట్టూర్పులు విడుస్తూ భక్తులు పడిలేచి వచ్చి మాకు ఫిర్యాదులు చేశారు. నీవు కాలి బాటకు అడ్డంగా పడుకొన్నావని. నీ వ్యవహారం నానాటికీ రాటుదేలుతున్నదే తప్ప ఒక కొలిక్కిరావడంలేదని." నీవు వెంటనే లేచి ఎక్కడికైనా వెళ్లిపో!" అన్నారు.

"నేనే ఈ స్థలం వదలి వైదొలగిపోతున్నాను, కాని ఒక్కటిమాత్రం గుర్తుంచుకోండి – **నేనెలా మనిషినో మీరు అలాగే మనుషులు. మనుజధర్మం మనిద్దరిలో సమానమైంది. మానవత్వం అందరిలో సామాన్యమైన గుణం. తక్కిన భేదాలన్నీ మానవులు స్వార్థపరత్వంతో కల్పించుకొన్నవే! ఇది సత్యనిత్యస్థితి!"** మీరు అసలే ఒక మిథ్యా ప్రపంచంలో ఉంటూ, అందులో రెండవ మాయా ప్రపంచమనే వర్ణభేదాలను సృష్టించుకొని రెంటికి చెడిన రేవడి అవుతున్నారు." అని తన గుడిసెలో ప్రవేశించాడు. బ్రాహ్మణులు, ఎప్పుడూ మాట్లాడని ఛోకామిళుని ఆలోచన రేకెత్తించే మాటలు విని అవాక్కయ్యారు. నిశ్చేష్టులయ్యారు.

## పూరిగుడిసెలో ధ్యానమగ్నుడై ఛోకామీళుడు భగవంతునికి ఆత్మనివేదన చేసికోవడం

ఛోకామిళుడు, తన పూరిగుడిసెకుపోయి, ధ్యానమగ్నుడైన కారణంగా అరమోడ్పుకనులతో పద్మాసనాసీనుడై, అంజలిబద్ధుడై, అని భగవద్ధ్యానంలో లీనమైనాడు. సూర్యాస్తమయమైంది. అర్థరాత్రమైంది. అప్పుడు పండరినాథుడు, ఛోకామిళుని అచంచల, అనన్యభక్తికి ఆనందించి, అర్చకులు గర్భగుడి తలుపులు బిగించిపోయిన వెంటనే లీలామానుష విగ్రహుడై కవాటాన్ని తెరుచుకొని ఛోకామిళుని గుడిసెకు వచ్చి సాక్షాత్కరించాడు.

ఇలా నిర్హేతుక జాయమాన కటాక్షంతో సాక్షాత్కరించిన భగవంతునికి ఛోకామిళుడు సాష్టాంగనమస్కారంచేసి అనేక విధాలుగా కొనియాడాడు. అందుకు ఆనందించిన శ్రీహరి "నీకేం కావాలి?" అని అడుగగా, ఛోకామిళుడు – "అనాథనాథా! కరుణాకరా! భక్తచింతామణీ! నీ సాక్షాత్కారంకంటె నాకేమీ కోరికలేదు. అయినా, నీవు అనుగ్రహిస్తావని చెబుతున్నావుగనుక కాబట్టి, మీ ఆలయంలో నాకు దర్శన మనుగ్రహించాలి" అని ప్రార్థించాడు. దానికి పండరీనాథుడైన పాండురంగవిట్ఠలుడు, **"ఓయీ! ఛోకామిళా! నీవు జన్మించిన క్షణంనుండి నా అంతరంగ భక్తుడివి, కాబట్టి నీకు అభ్యంతరమేముంది?** అని పలికి గర్భాలయానికి అతనిని పిలుచుకొనిపోయి దగ్గరగా కూర్చుండబెట్టుకొని ఎన్నో ముచ్చటలు చెప్పసాగాడు.



వీరిద్దరి ముచ్చటలు అనేకవిధాలుగా జరుగసాగాయి. పాండురంగడు, ఛోకామిళునిపై తనకుండే ప్రేమనంతా విస్పష్టంగా చూపాడు. **ఆ సందర్భంలో జీవాత్మ పరమాత్మలకుగల శుద్ధాద్వైత భావమంతా ప్రకటితమయింది.** అంతలో తెల్లవారింది. అర్చకులందరూ తమ విధ్యుక్తధర్మాలు నిర్వహించేందుకు గుడిలో ప్రవేశించారు. వారిలో 'కుంచెకోలలు' (పెద్దతాళపు చెవులగుత్తి) పట్టుకొన్న ప్రధాన అర్చకుడు గర్భాలయం దగ్గరికి వచ్చేటప్పటికి, లోపల ఎవరో మాట్లాడుతున్న గొంతుక సవ్వడి విని, ఆశ్చర్యపడుతూ, తన తోటి అర్చకులందరిని పిలిచి, హఠాత్తుగా తలుపు తెరిచాడు. ఇదంతా గ్రహించిన పండరీనాథుడు అర్చావిగ్రహంలో తిరోహితుడయ్యాడు. ఛోకామిళుడు నివ్వెరబోయాడు.

ఇంతలో అర్చకులు గర్భగుడి ప్రవేశించి ఛోకామిళుని చూచి మొదట తెల్లమొహం పెట్టినవారై, ముచ్చెమటలు పోయగా ఆగ్రహోదగ్రులై, "ఓరీ దురాత్మా! చండాలుడుగా ఉండికూడా ఎంతపని చేశావురా!" అని కర్రలతో కొట్టడానికి పూనుకోగా, దానికి ఛోకామిళుడు, "అయ్యలారా! నామీద ఎందుకు కోపపడుతారు? నాకేమీ తెలియదు. పండరినాథుడు నా గుడిసెలో సాక్షాత్కరించి చేయిపట్టుకొని ఇక్కడికి తీసుకువచ్చాడు. వెళ్లమంటే ఇప్పుడే వెళ్లిపోతాను. అంత కోపం దేనికి? అని వినయంగానే పలికాడు. దానికి అర్చకులందరూ కూడబలుక్కుని, "అయిపోయినదానికి ఇక విచారణ వద్దు. ఉన్నపళాన నీవు వెంటనే గుడి విడిచి వెళ్లిపో! ఈ సంగతి ఎవరికి తెలియజేయవద్దు. ఇకమీదట నీవు మాలపల్లిలో కూడా ఉండటానికి వీలులేదు. చంద్రభాగానది ఆవలి ఒడ్డుకుపోయి అక్కడ ఉండు." అని గద్దించి చెప్పారు.

ఛోకామిళుడు మారుమాటాడకుండా మౌనంగా వెళ్లిపోతూ, మధ్యలో నిలబడి, "అయ్యలారా! మీ ఆజ్ఞ చొప్పున వెళ్లిపోతున్నాను. కాని, **ఈశ్వరుడు సర్వసముడు. అతనికెటువంటి భేదభావాలు లేవు. భక్తి, జ్ఞాన, వైరాగ్యాలు లేనివాడు బ్రాహ్మణుడైనా, ఈశ్వరకృపకు పాత్రుడుకాడు. మాటిమాటికి మీరు నన్ను 'చండాలుడు', చండాలుడు అని దెప్పి పొడుస్తున్నారు.**

గుడిలోనికి రాకూడదనడం ఏమి న్యాయం? నేను మెట్టినస్థలం మీకు అపవిత్రమైతే, నేను స్నానమాడిన చంద్రభాగానదీ జలం మీకు స్నానయోగ్యమౌతుందా? నేను నివసించే ఈ భూమి మీకు వాసయోగ్యమా? నేను పీల్చినగాలి మీరు పీల్చ వచ్చునా? మీతో వాగ్వాదం చేయడానికి రాలేదు నేను. ఇప్పుడు మీరెలా చేయమంటే అలా చేస్తాను. చంద్రభాగకు అద్దరిని నివసిస్తాను." అని బదులిచ్చాడు.

### పండరీనాథుడు ఛోకామిళునితో కలిసి ఇష్టాన్నభోజనం చేయడం

ఛోకామిళుని నివాసస్థానంలో మార్పు వచ్చినప్పటికీ, హరిధ్యానంలో మార్పు ఏర్పడలేదు. అతడు మునుపటి వలెనే శ్రీహరిని సేవిస్తూ ఉండినాడు. ఛోకామిళుడు భక్తిపారవశ్యంతో పాడిన 'అభంగములు' 350 దాకా ఉన్నాయి. అందులో భక్తినివేదన, మోక్షకాంక్ష, ఆర్తి, ప్రేమానురక్తి, వంటి భావాలేగాక భగవంతుని కూడ దోషిగా నిలదీసి ప్రశ్నించిన సందర్భాలుకూడ ఉన్నాయి. ఉదాహరణకు –

**"వేగమెరారా విట్ఠూ! వేవేగమెరారా విట్ఠూ!!"** (ధావఘలీ విట్ఠూ!) అనే అభంగంలో – "నీ అర్చకులు నన్ను **'మహర్, 'మహర్'** అని కర్రలతో తరిమికొడుతుంటే నీవు కరుణ లేక చూస్తూ ఊరుకొంటావేమయ్యా! ('మహర్' అంటే మాలవాడు, చండాలుడని అర్థం) నేను నీ కంఠాభరణాన్ని దొంగలించానని అపనింద మోపారయ్యా! దానికి నేను ఏమని చెప్పను! నీ మౌనమే దానికి సమాధానమా (లేక ఛోకామిళుడే స్వామికి కంఠాభరణమా!) **వడిగారారా విట్ఠూ! వడివడిగారారా విట్ఠూ!!** నీగుడివాకిలికి కాపలా కాచే కుక్కనయ్యా నేను! ఓ చక్రపాణీ! నన్ను నిరాదరించ వద్దు! తృణీకరించ వద్దు! నేను కఠినంగా నిందించానని కోపగించుకోవద్దు." ఇలా తన అంతరంగాన్ని కపటంలేకుండా నివేదించుకొన్నాడు. అభంగాలలో ఛోకామిళుడు తనను కుక్కతో పోల్చుకోవడంలో తనది నీచజన్మ అని స్ఫురింపజేయడమే కాదు తన బ్రదుకు కుక్కకంటే నీచమైపోయిందని, దాన్ని ఎందరు ఎంతగా తరిమికొట్టినా ఆ కుక్కకు ఉన్న **'విశ్వాసం'**



పోయేదికాదని, తానటువంటి 'విశ్వాస పాత్రుడనని' ధ్వనింపజేశాడు. ("రక్షిష్యతీతి విశ్వాసః" అనే శరణాగతి తత్త్వానికి ఛోకామిళుడు ప్రతీక!)

ఒకనాడు ఛోకామిళుడు గుడిసె బయట కూర్చొని ఉండగా, అతని భార్య కుండతో అన్నాన్ని తెచ్చి వడ్డిస్తూ ఉంది. ఆ సమయంలో పాండురంగడు సాక్షాత్కరించి, భక్తాగ్రేసరా! ఛోకామిళా! నాకు నీతో కలిసి భుజించాలనే కోర్కె కలుగుతోంది. అని చెప్పగా ఛోకామిళుడు ఆశ్చర్యపడి, "శ్రీహరీ! దీనికి అభ్యంతరమేముంది! అని అన్నం ఉండే గిన్నెను తీసుకొని శ్రీహరిని వెంటరమ్మని చెప్పి దగ్గర్లో ఉండే ఒక వేపచెట్టు కిందికిపోయి కూర్చొని, రుక్మిణీకాంతునితో కలిసి భోజనం ప్రారంభించాడు. **శ్రీవైష్ణవ సంప్రదాయంలో భగవంతుడు భక్తునితో కలిసి భుజించడమనేదొక విశిష్ట, విలక్షణ సన్నివేశం! దీని అంతరార్థమేమంటే, భగవంతుడు భక్తుని తన అంతరంగంలో కలుపుకోవడం అంటే భక్తుడు స్వామితో సాయుజ్య మోక్షాన్ని పొందడం అనే చరమ పరమ ఘట్టమే భోజన సన్నివేశం! ఒక భక్తుని అంతరంగం లోకానికి తెలియదు. ఈ అంతరంగ కైంకర్య రహస్యం స్వామివారికే తెలుసు. 'అందరి అంతరంగం తెలిసినవాడు ఆ రంగడొక్కడే'** అంటారు పెద్దలు. భక్తుడు, దేవుడు భోజన పారవశ్యంలో నిమగ్నులై ఉండగా కొంతసేపటికి, ఛోకామిళుని భార్య పెరుగుకుండను తీసుకొని వచ్చింది. దైవసంకల్పంచే ఆమె చేతులు జారి కుండపడిపోగా పెరుగంతా పాండురంగని పీతాంబరంపై పడింది. అందుకు ఛోకామిళుడు చాల నొచ్చుకొన్నాడు. కాని, మరల చూస్తే స్వామి పీతాంబరం యథాతథంగా ఉంది.

### ఒక విచిత్ర సన్నివేశం

ఇంతలో ఒక బ్రాహ్మణుడక్కడికి వచ్చాడు. అతడు చండాలుడైన ఛోకామిళునితో శ్రీహరి కలిసి భుజించడం చూచి ఓర్చుకోలేక, అసూయతో అసహ్య బుద్ధితో ఛోకామిళుని చెంపపై పెళ్లుమని కొట్టాడు. వెంటనే, విట్ఠలుని ఎడమ బుగ్గ పొంగి బూరెలాగా అయింది. దానిపై అయిదు వేళ్లగుర్తులు

విస్పష్టంగా కన్పిస్తోంది. బ్రాహ్మణుడు ఛోకామిళుని చెంప పెట్టుయిస్తే, శ్రీహరి బుగ్గలు వాచిపోవడమేమిటి? ఆ దెబ్బకు దేవుని కళ్లలో నీళ్లుతిరిగి కారడమేమిటి?

ఈ ఛోకామిళుడు సామాన్యుడు కాడు. ఇతడు **శ్రీహరి అంతరంగ భక్తుడని** తెలుసుకున్నాడు. ఇతడు చండాలుడని చక్కగా తెలిసికూడా భగవంతుడు అతనితో కలసిమెలసి ఉండడం చూస్తే ఛోకామిళుడు. నిజంగా, భగవంతుని **'అనన్యభక్తుడే'**నని బ్రాహ్మణుడు తెలుసుకున్నాడు.

వెంటనే ఛోకామిళుని పాదాలపై బడి – **'మహాత్మా! భాగవతాగ్రణీ!** నీ మహామహిమ తెలిసికోలేక అపరాధినయ్యాను. నీవు క్షమింపకుంటే నాకు వేరే దిక్కులేదు. నేను ఒళ్లు తెలియక నిజంగా శ్రీమన్నారాయణమూర్తినే కొట్టాను కాబోలు! నన్ను రక్షించు!" స్వామి చెక్కిలి చూస్తే నా కడుపు తరుక్కుపోతున్నది. అని అనేక విధాలుగా ప్రార్థించాడు. దానికి ఛోకామిళుడు స్వామి సన్నిధికి జేరి **అవ్యయా! అనంతా!** నీ మాయలు అనంతాలు. నీ లీలలు అజేయాలు. ఈ క్షుద్ర సేవకునిపై ఇంత అనుగ్రహం చూపడం కేవలం నీ నిర్హేతుక కృపాకటాక్షం! ఈ మహానుభావునికి సంతాపం కలిగింది. జ్ఞానప్రకాశమైంది. ఇక నీ పాదపద్మాలు విడువజాలడు. ఇతని కనికరించి రక్షించు!" అని వేడుకొని పొంగిన చెక్కిళ్లు తాకాడు. వెంటనే అది యథాపూర్వంగా అయినాయి.

ఇదంతా చూచి ఆ బ్రాహ్మణుడు ఉన్న పళాన గ్రామంలోకి పరిగెత్తుకొనిపోయి, జరిగిన సంగతంతా చెప్పగా, బ్రాహ్మణులే కాదు, గ్రామ ప్రజలందరూ వచ్చి ఛోకామిళుని పాదాలమీదపడి **"మహాత్మా!** నీ మహిమ తెలియక అపరాధాలు చేశాము. ఎన్నో దుర్భాషలు పలికాము. మన్నించి రక్షింపుమని ప్రార్థించారు. ఛోకామిళుని పండరినాథ గర్భాలయంలోకి తీసుకొనిపోయారు. అతడు పండరినాథుని ఆలయానికి ప్రతిరోజు వచ్చి దర్శించుకొనేవాడు. అవసానదశలో శ్రీపతి సాయుజ్యాన్ని పొందాడు.

* * *

# 6. సంత్ శ్రీఏకనాథ్ మహారాజ్

## (క్రీ.శ.1533-1599)

పైఠణపురంలో భానుదాసు అనే మహానుభావుడుండేవాడు. అతని కుమారుడు చక్రపాణి. ఈ చక్రపాణికి సూర్యనారాయణుడనే కుమారుడు కలిగాడు. సూర్యనారాయణునికి క్రీ.శ.1533లో ఏకనాథుడనే పుత్రుడు పుట్టాడు. ఏకనాథుని తల్లిపేరు రుక్మిణి. ఒక్కొక్క తరంలో ఒక్క పురుషసంతానమే కలిగే ఆ వంశంలో ఏకనాథుడే ఏకైక పుత్రుడుగా ఎంతోగారాబంగా, అల్లారు ముద్దుగా పెరిగి పెద్దవాడు కాసాగాడు. "నిక్కమైన మంచినీల మొక్కటి చాలు, తళుకు బెళుకు రాళ్లు తట్టెడేల?" అన్నట్లుగా, 'రత్నదీపం వంటి ఒక్క బిడ్డేచాలు' అని ఆయన తల్లితండ్రులు సంతృప్తితో కాలం గడుపసాగారు.

తల్లితండ్రీ కన్నబిడ్డపట్ల చేయవలసిన బాధ్యతలైన ఉపనయనం చేసి, విద్యాభ్యాసానికై ఒక గురువు వద్దకు పంపారు. ఏకనాథుడు 'ఏకసంథాగ్రాహి' కావడంవల్ల, **"ప్రపేదిరేప్రాక్తన జన్మవిద్యా"** అన్నట్లు, ప్రాగ్జన్మ సంస్కార వశంచేత ఆ గురువు వద్ద సకల విద్యల్లో పారంగతుడైనాడు. తల్లితండ్రులతనికి యుక్తవయస్సులో వివాహం చేశారు.

ఏకనాథుడు చిన్నప్పటినుండి అంతర్ముఖుడు, మితభాషి, హితభాషి, ఎప్పుడూ హృదయంలో నారాయణ నామస్మరణచేస్తూ ఉండేవాడు. 'భాగవతసేవ' అంటే అతనికి చాల ఇష్టం! సహజంగా వైరాగ్యవంతుడు కావడంచేత, వైవాహిక జీవితం కూడ అతనిలో పెద్దమార్పును తీసుకొని రాలేదు. నిర్లిప్తుడుగా, నిర్మముడుగా, నిష్కామకర్ముడిగా తన జీవితాన్ని గడుపుతూ, తన జీవితానికి 'దిక్సూచి' లాంటి గురువు లభిస్తాడా అనే అన్వేషణలో కాలం గడుపసాగాడు.

**గురువుకై అన్వేషణ :** ఆ సమయంలో 'జనార్దనయోగి' అనే మహాత్ముడు పైఠణపురంలో ఒక మఠాన్ని నిర్మించుకొని అక్కడ తన తపస్సాధన, సామాజిక సేవా కార్యక్రమాలను నిర్వహిస్తూ ఉండేవాడు.

ఏకనాథుడు, ఇతడే తనకు సరియైన గురువు అనుకొని ఆయన పాదాలపై సాష్టాంగ దండప్రణామం ఆచరించాడు. జనార్దనయోగి ఎంతో ప్రీతుడై, 'వత్సా 'నీపేరేమి? నీ తల్లితండ్రులెవరు? నీవు ఇక్కడికెందుకు వచ్చావు?' అని అడిగాడు. దానికి ఏకనాథుడు, స్వామీ! సర్వమూ తెలిసిన మీరే ఇలా ప్రశ్నిస్తే నేనేమి చెప్పగలను? భగవద్గీతలో కృష్ణపరమాత్మ చెప్పినట్లు, అర్జునుడు అనేక జన్మలెత్తి చిట్టచివరగా పుట్టిన జన్మలో శ్రీకృష్ణపరమాత్మనే గురువుగా పొందినట్లు, ఆ జన్మలన్నీ అర్జునునికెలా జ్ఞాపకంలేవో నాకు గత జన్మలేవీ జ్ఞాపకం లేవు. కాని, ఈ జన్మలో మీరు నాకు గురువుగా నన్ను ఉద్ధరిస్తారని మిమ్మల్ని ఆశ్రయించాను. మీరు త్రికాల జ్ఞానసంపన్నులైన యోగులు. నన్ను మీ శిష్య పరమాణువుగా స్వీకరించి, ఉద్ధరింపవలసిందని ప్రార్థించాడు.

అప్పుడు జనార్దన యోగి, ఏకనాథునితో నీవు నా మొదటి ప్రశ్నకు సమాధాన మిచ్చావు! రెండవ ప్రశ్న అలాగే ఉంది అన్నాడు. దానికి ఏకనాథుడు 'స్వామీ! నేను నేనే. నన్ను నేను సమగ్రంగా తెలుపుకోవడానికి తగిన సామర్థ్యం నాకు లేదు. ఆ పరమాత్మ సృష్టించిన అనంతకోటి జీవరాశుల్లో నేను ఒక జీవుణ్ణి. నేనిప్పుడు మీ సన్నిధికి **'జ్ఞానభిక్ష'**ను కోరివచ్చాను. జీవులందరూ భగవదంశ సంభూతులైనా పంచభూతాత్మకమైన శరీరమనే ఉపాధిని ఆశ్రయించడం వలన **'మాయ'** చేత ఆవరింపబడినవారై, మోహంచేత అంధులై, తమను తామెవరో తెలిసికోలేక పోతున్నారు. అటువంటివారికి జ్ఞానప్రకాశాన్ని కల్గించి 'మాయ' అనే తెరను తొలగించి, మోక్షమార్గంలో ప్రవేశపెట్టే దిశానిర్దేశకులు ఆచార్య పురుషులే ననడం ఎంతైనా వాస్తవం! అటువంటి ఆచార్యులైన మిమ్ములకు 'ఏకనాథుడ'నే జిజ్ఞాసువు మీరే ఏకైక గురువుగా ఆశ్రయిస్తున్నాడు. నన్ను మీ శిష్యునిగా గ్రహించి ధన్యాత్మునిగా చేయండి" అని ప్రార్థించాడు.



## శిష్యసంవరణం

ఏకనాథుని మాటలు విలక్షణంగా ఉండడం వలన ఇతడు సంస్కారవంతుడే నని గ్రహించి, "అయితే, నీ దృష్టిలో నిజమైన ఆచార్యుడెవ్వరో చెప్పగలవా? దాపరికం లేకుండా నిర్భయంగా చెబితే సంతోషిస్తాను అన్నాడు జనార్దన యోగి.

"మహాత్మా! మీరు నిర్భయంగా చెప్పమన్నారు గనుక చెబుతున్నాను. లోకంలో ఆచార్యులకు కొదువలేదు. **"భగ్నాకృషిః భాగవతా భవంతి"** అన్నారు పెద్దలు. నిజమైన కృషి చేసి సంపాదించదగిన సాధనమార్గాలన్నీ వ్యర్థప్రయత్నాలుకాగా, చివరికి అటువంటివారు **'భాగవతులు'**గా వేషధారులై లోకాన్ని మోసం చేస్తున్నారు. బతుకు తెరువు కోసం పన్నెండు ఊర్ధ్వపుండ్రాలను ధరించి, శిష్య సందోహాన్ని పెంచుకొని మౌనవ్రతం అవలంబించిన వారితో ఏం ప్రయోజనం? ఉపదేశాలకు మించి, పాదపూజలు, దక్షిణలు, బహుమతులు, ఈనాములు సంపాదించే ఆచార్యుల వలన లోకానికేమి లాభం? ఆస్తులు కూడబెట్టుకొనే ఆచార్యుడు నిజమైన ఆచార్యుడు కాదు. నాకు ఈ ప్రపంచాన్ని చూస్తే భయం వేస్తున్నది. శ్రీహరిసేవే భయార్తులకు తారకమని నిశ్చయించుకొన్నాను. చక్కని ఆచార్యుని నిమిత్తం వెదుకుతున్నాను, నన్నెందరో సందు గొందుల్లోని ఆచార్యులు చేరదీయడానికి ప్రయత్నించారు. కాని, కేవలం భక్తుడు అనిపించుకోవడం నా కిష్టంలేదు. **నాకు కావలసింది నిజమైన హరిభక్తి!** హరిదాసుడనిపించుకోవడం కూడ నా కిష్టంలేదు. నేను నిరంతరం కాంక్షించేది **'శ్రీహరిపూజ, శ్రీహరి ధ్యానం, శ్రీహరి భజనం, శ్రీహరి కటాక్షం.** ఇవి నాకు సంఘటింపజేయగల ఆచార్యుడు కావాలి! దీని కోసమే నేను అన్వేషిస్తున్నాను. మీరునన్ను పాపపంకం నుండి

ఉద్ధరిస్తారని, అజ్ఞానమనే అంధకారం నుండి తప్పించి, ముముక్షువుకు కావలసిన మోక్షాన్ని యిప్పిస్తారని కోరి మీ వద్దకు వచ్చాను. ఈ దీనుని, ఈ జ్ఞాన భిక్షువును, ఈ ఆర్తుని, ఈ సేవకుని చేరదీసి రక్షిస్తారని ఆశిస్తున్నాను" అని ప్రాధేయపడ్డాడు.

ఈ మాటలు విని జనార్దన యోగి ఆశ్చర్యచకితుడయ్యాడు "ఏకనాథా! ప్రస్తుతం నీ ఈ మనస్థితి అంతా ప్రస్తుతం ఉన్న ప్రపంచానికి కేవలం వ్యతిరేకంగా ఉంది. బ్రహ్మ నిన్ను అందరివలె సృష్టింపక ప్రత్యేకమైన దినుసుతో సృష్టించినట్లుంది. నీ ఈడు వయస్సుగల కుర్రవాళ్లందరు ప్రాపంచికమైన మాయకు లోబడినవారై వ్యామోహంలో మునిగిపోయి, ఐహిక సుఖాలు కోసం వెంపరలాడుతూ ఉంటే, నీవు ఈ విధంగా 'జ్ఞాన భిక్షువుగా, మోక్ష కాంక్షివై ఉండడం చూస్తే నీవో **కారణజన్ముడవని** నాకు అనిపిస్తూ ఉంది. నీ ఈ జిజ్ఞాసకు నేను పరమానంద భరితుడనయ్యాను. **భాగవతులకు భగవద్ధర్మంకంటే భగవంతుని కోసం అన్వేషించే వారే కన్పించడం ఎక్కువ ఆనందకారణం!** నీవు సదాచార్యుని కోసం ఎలా లోకంలో అన్వేషిస్తున్నావో, అట్లే నేను గూడ సచ్ఛిష్యుని కోసం ప్రపంచమంతా గాలిస్తున్నాను. ఈనాటికి శ్రీహరి అనుగ్రహం కలిగింది. రావయ్యా ఏకనాథా! నీవే ఏకైక శిష్య చూడామణివి! నీకేమీ లోపం రానివ్వను" అని జనార్దన యోగి సచ్ఛిష్యసంవరణం చేశాడు.

### జనార్దన యోగి మఠంలో...

ఏకనాథుని జ్ఞాన, భక్తి, వైరాగ్యాలకు సంతసించిన జనార్దన యోగి, ఒక రోజు శిష్యుణ్ణి పిలిచి, "వత్సా! నీవు నీ తల్లితండ్రులకు ఏకైక పుత్రుడివి. పైగా వివాహితుడివి. నీ కొఱకు ఇంటిల్లి పాదీ బెంగతో ఉంటారు కదా! అందులో విశేషించి, జరుగుబాటు ఎట్లా? సంపాదన లేదు కదా! అందుకని నేను ప్రతినెల కొంత సొమ్ము నీ ద్వారా పంపిస్తాను. నీవు వెళ్ళి వారికిస్తే నీ క్షేమమూ వారికి తెలుస్తుంది. నీ మనోరథమూ ఇక్కడ సిద్ధిస్తుంది" అన్నాడు.



దానికి ఏకనాథుడు "గురుదేవా! జీవితాన్ని మీ సేవలో వినియోగించి, మీ వలన జ్ఞానధనాన్ని పొందాలని ఇక్కడికి వస్తే మీరు నా కుటుంబానికి ధనమివ్వడం దేనికి? దానికి నేను అంగీకరించను. ఈ విధంగా నేను పరోక్షంగా మీనుండి ధనసహాయం పొందడం నా శిష్యరికానికే కళంకం" అని దుఃఖించాడు.

గురువు జనార్దనయోగి, ఏకనాథుని నిర్లిప్తతకు చలించిపోయాడు. "నాయనా! నేను ఈ ధనం నీకివ్వడంలేదు. మీ తల్లితండ్రులకు ఇస్తున్నాను. ఇకమీదట నీవు ఈ మఠానికి సంబంధించిన ఆదాయవ్యయాల లెక్కలు సరిచూచే పని చేయవలసిందిగా నియమిస్తున్నాను. ఆ పని చూడవలసింది" అన్నాడు. అప్పుడు ఏకనాథుడు దానికంగీకరించాడు. ఇలా కొంతకాలం గడిచింది. ఏకనాథుడు తన బాధ్యతల్ని సక్రమంగా నిర్వహిస్తున్నాడు.

కొన్ని నెలలు గడిచిన తర్వాత జనార్దనయోగి శిష్యుని సామర్థ్యాన్ని, దీక్షను పరీక్షించాలనిపించింది. ఈ ఉద్దేశంతో ఏకనాథా! మఠంలెక్కల దస్తావేజు పూర్తిచేసి తీసుకొని రమ్మన్నాడు తనిఖీ చేయడానికి. ఏకనాథుడు ఆనాటి వరకుగల లావాదేవీలను సరిచూడడం ప్రారంభించాడు. ఒకచోట ఎక్కడో ఒక నెలలోని లెక్కలో కొంచెం తేడా వచ్చింది. ఆ పొరబాటు దేనివల్ల కలిగిందో తెలుసుకొని సరిచేయాలని ఆరోజు రాత్రి చేయవలసిన పనులు పూర్తిచేసి, ఆముదపు దీపపు వెలుగులో పాతలెక్కలతో కుస్తీ పట్టసాగాడు. మూడుజాముల రాత్రి జనార్దనయోగికి మెలకువ వచ్చిచూడగా ఏకనాథుడు తదేకంగా లెక్కలు వేయడంలో నిమగ్నుడై ఉన్నాడు. ఆ తర్వాత జనార్దనయోగి నిద్రరాక ఒకచోట దాగి ఉండి శిష్యుని నిఘావేసి వేచి ఉన్నాడు. చాలాసేపటికి తప్పు ఎక్కడ దొర్లినదో కనిపెట్టి లెక్క సరిపోగా ఏకనాథుడు ఎగిరి గంతువేసి భళిరాభళీ! అని ఆనందంతో గట్టిగా కేకలు పెట్టి కరతాళధ్వనులు చేశాడు.

ఆ కేకలకు, చప్పుళ్లకు హడావుడిగా జనార్దనయోగి అక్కడికి వచ్చి, "ఏకనాథా! ఏమైనది? ఏమిటాకేకలు! కరతాళధ్వనులు" అని అడగ్గా, స్వామీ! ఏమీ లేదు. వడ్లగింజలో బియ్యపుగింజ! మఠం లెక్కల్లో ఒకనెల తేడారాగా నేను మొదట్నుంచి చూస్తూ ఎక్కడ తప్పు జరిగిందో దాన్ని కనిపెట్టి, పొరబాటు సరిదిద్ది దాన్ని అర్థవంతంగా ముగించాను. ఆ ఆనందంపట్టలేక గట్టిగా అరిచాను అంతే మీకు నిద్రా భంగం కల్గించానేమో! క్షమించండి! అన్నాడు. దానికి జనార్దనయోగి ఆశ్చర్యచకితుడై "ఎంత శ్రద్ధ! ఎంత శ్రద్ధ! ఎంత ఓర్పు ఎంత ఓర్పు" ఈ ఓర్పుశ్రద్ధలు లౌకిక విషయాల్లో ఉన్నవాడు ఆధ్యాత్మికంగా చప్పున పైకి ఎదిగిరాగలడు". అనుకొని "నాయనా! ఏకనాథా! రాత్రి చాలప్రొద్దు పోయింది. ఇప్పటికి పోయి పడుకో! రేపు అవన్నీ చూద్దాములే! అని నిద్రపోవడానికి ముందు," రేపు ఏకనాథునికి తారక మంత్రోపదేశం చేయాలని నిర్ణయించుకున్నాడు.

## ఏకనాథునికి తారకమంత్రోపదేశం

"వత్సా! ఏకనాథా! నీ చిత్తైకాగ్రత అసమానం. నీభక్తి అచంచలం. నీ నిష్ఠ అనుపమానం. ఇంత స్వల్ప విషయంలో కూడ యథార్థం తేలేంతవరకు నిద్ర, ఆహారాన్ని మాని కార్యజయం పొందిన నీకు భగవత్సాక్షాత్కారం కలిగి తీరుతుంది. ఇంత మనోనిగ్రహాన్ని నేనెక్కడ చూడలేదు. మోక్షం నీ కరతలామలకమౌతుంది. భగవత్సేవలో కూడా ఇదే విధంగా ప్రవర్తింతువు గాక! అని ప్రశంసించి తారకమంత్రాన్ని ఉపదేశించాడు జనార్దనయోగి!

"నాయనా! ఏకనాథా! శ్రద్ధగా విను. రామరహస్యోపనిషత్తులో శ్రీరామ బ్రహ్మ తారకమంత్రమిలా చెప్పబడింది. తారకమంటే తరింపజేసేది. ఈ భౌతిక శరీరంలోని జీవుని జనన మరణాలనే రెండుగట్లు గల జీవితసాగరాన్ని దాటింపజేసేది. సంసారజలధి దాటింపగలది రెండక్షరముల నామమే! అది శ్రీరామచంద్రుని నామమే!



**"రామ ఏవ పరంబ్రహ్మ! రామఏవ పరం తపః ।**
**రామ ఏవ పరం తత్త్వం! *శ్రీరామోబ్రహ్మ తారకమ్* ॥**

**" 'రా' శబ్దోచ్చారమాత్రేణ, ముఖాన్నిర్యాంతి పాతకాః ।**
**పునః ప్రవేశ భీత్యాచ 'మ' కారస్తు కవాటవత్ ॥"**

అని శ్రీరామ కర్ణామృతం (1-101) చెబుతోంది. **'రా'** అనే అక్షరం ఉచ్చరించినంత మాత్రం చేతనే పాపాలు నోటిగుండా తొలగిపోతాయి. ఆ పాపాలు తిరిగి ప్రవేశిస్తుందనే భయంచే **'మ'** అనే అక్షరం తలుపులాగా మూతబడిపోతున్నాయి.

### లేఖన పద్ధతి

**"శ్రీం ఓం రాం రామాయనమః"** ఇది బీజాక్షరయుక్తమైన రామషడక్షరీమంత్రం. రామతారకమంత్రం! **'శ్రీం రాం'** అని చేర్చడం చేతనే మంత్ర సంపుటి సంపూర్ణమౌతున్నది. మంత్రలేఖన సంప్రదాయంలో దాని దుర్వినియోగ నివారణార్థం విలోమపద్ధతి పాటిస్తారు. మంత్రోచ్చారణ చేసేటప్పుడు -

### జప ఉచ్చారణ పద్ధతి

**"ఓం శ్రీం రాం రామాయనమః"** అని ఉచ్చరించాలి! **బీజాక్షరయుక్త మంత్ర రహస్యం!** 'శ్రీం' అనే మంత్రంలోని **'శ'** కారానికి **'లక్ష్మి'** అని అర్థం. రేఫం అగ్ని బీజం. కాబట్టి, **'శ్రియ మిచ్ఛేత్‌హుతాశనాత్'** అనే ప్రమాణంచేత, అది సంపత్కరం. (సంపదకు అనుగ్రహించేది) **'ఈ'** అక్షరానికి **'తుష్టి'** (తృప్తి, సంతృప్తి) అని అర్థం. నాదానికి ఈశ్వరుడని అర్థం. (ఓంకారనాదం - నాదమే తనువుగా గలవాడు శివుడు) బిందువు దుఃఖహరం (జీవగతమైన దుఃఖాన్ని తొలగించేది)

**'శ్రీం రామాయనమః'** అని జపించేవారు ఈ అర్థాన్ని మనస్సులో నిలిపి శివయుక్తమై దుఃఖాలను హరించి తుష్టిని సంపత్తును కల్గించే శ్రీదేవిని

ధ్యానించాలి. **'శ్రీరామ'** అన్నప్పుడు అటువంటి శ్రీదేవితో కూడిన రామచంద్రమూర్తిని ధ్యానించాలి.

రామషడక్షర మంత్రంలో చివరిది **'నమ'**శ్శబ్దం. **'నమః'** అనే శబ్దాన్ని అఖండంగా, సఖండంగా సమన్వయించవచ్చు. అఖండంగా చెప్పినప్పుడు **'నమః' = 'నమస్కారము'** అని అర్థం. సఖండంగా చెప్పినప్పుడు **'న+మః = నా కొఱకు కాదు'** అని అర్థం. మరి, ఎవరికోసం? **'శ్రీరామచంద్రునికోసం'** అని అర్థం.

**'ఓం'**కార రహస్యమిది. **అ**కార, **ఉ**కార, **మ**కారముల అక్షర సంపుటీకరణమే ఓంకారము.

1. **'అ' – 'అక్షరాణాం అకారోஉస్మి'** అని విభూతియోగం. భగవద్గీత. అక్షర సమామ్నాయంలో **'అ'** అనే తొలి అక్షరం నేనే; (విష్ణువు) = రాముడు.
2. **'ఉ'** – లక్ష్మీదేవి అమ్మవారు
3. **'మ'** – జీవుడు

**ఓంకార రహస్యాన్ని రామాయణపరంగా సమన్వయిస్తే –**

1) 'అ'కారము – రాముడు

2) 'ఉ'కారము – సీత

3) 'మ'కారము – జీవుడు – లక్ష్మణుడు. (దాసుడు, సేవకుడు).

అకార, ఉకారాలైన రాముని సీతను సేవించుకుంటూ జీవితాన్ని గడపవలసినవాడు జీవుడైన లక్ష్మణుడు. **"రామున్ రామను కొల్చుచున్ చనుమురా రామానుజా! లక్ష్మణా!"** అని అగస్త్య మహర్షి వాక్కు. **లక్ష్మణుడనే ఆదిశేషుడు** తొట్టతొలి జీవుడు. ఇతడు సీతారాములను జీవితాంతం సేవించి పరమపదాన్ని అలంకరించాడు. ఇది రామాయణ రహస్యం! ఓంకార రహస్యం. శ్రీరంగంలోని విమానంపేరు ప్రణవాకార (ఓంకార) విమానం"



ఇందులోని, మూర్తి **పరవాసుదేవమూర్తి!** ఇది వైకుంఠంలోని విష్ణువుకు పేరు. శ్రీరంగం కలియుగ వైకుంఠం. విష్ణుపురాణంలో పరవాసుదేవతత్త్వం వివరంగా చెప్పబడింది.

శ్రీమద్రామాయణానికి శ్రీ సీతాదేవి 'ప్రాణ'మని విజ్ఞులు చెబుతారు. దీనినే వాల్మీకి **'సీతాయాశ్చరితం మహత్'** (సీతాదేవి చరిత్ర (శీలము) గొప్పది) అన్నారు. శ్రీరామాయణ **'దీర్ఘశరణాగతి'**కి ఉదాహరణ! ఈ **శరణాగతి**కి **'నమ'**శ్శబ్దం ప్రాణం! **'నమ'**శ్శబ్దం (న+మః) లేకుండా **'శరణాగతి'** లేదు. **"తస్య చ వశీకరణే తచ్ఛరణాగతి రేవ" – 'ఆ భగవంతుని వశీకరింప జేసుకోవడానికి శరణాగతి ఒక్కటే మార్గం'** అని భగవద్రామానుజులు శ్రీభాష్యం ప్రారంభంలోనే చెప్పారు. 'శరణాగతి'కే మరొకపేరు 'ప్రపత్తి'. ప్రపత్తి (శరణాగతి) చేసినవానినే 'ప్రపన్ను'డంటారు. ప్రపన్నుడైనవానికే స్వామి అభయహస్తాన్ని చూపి అన్ని భయాలను నిర్మూలించి మోక్షాన్ని అనుగ్రహిస్తాడు'' అని జనార్దనయోగి, ఏకనాథునికి రామషడక్షరీ తారకమంత్రోపదేశాన్ని అంగన్యాస, కరన్యాస సహితంగా ఉపదేశించారు.

## జనార్దనయోగి ఏకనాథునిచే తన గురువైన దత్తాత్రేయస్వామి దర్శనం చేయించడానికి ప్రయత్నించడం

ఏకనాథునికి గురుభక్తి, గురుసేవానిరతి రోజు రోజుకు అధికం కాసాగింది. జనార్దనయోగి పరమానందభరితుడై ఒకనాడు, "వత్సా! ఏకనాథా! నీకు నా గురుదేవుడగు దత్తాత్రేయస్వామి దర్శనభాగ్యం కల్గించాలనే తలపుతో ఉన్నాను. ఆయన ఒక విచిత్ర యోగి. మర్మయోగి ఒకసారి విపరీత వేషధారియై, మరోసారి విపరీత చేష్టలతో సాక్షాత్కరిస్తుంటాడు. దానికి నీవేమీ సందేహమూ, సంకోచమూ పడక ఆ మహాత్ముని పాదాలపై వ్రాలి శరణువేడుకో! నీవు ముక్తుడవౌతావు" అని చెప్పగా ఏకనాథుడు, "మహాత్మా! నాకు దత్తాత్రేయస్వామితో ఏమిపని! మీ పాదాలే నాకు ముక్తిని ప్రసాదించడంలో సమర్థాలై ఉన్నాయి కదా! అన్నాడు.

కాని, గురువు మాటే బరువైన మాట కాబట్టి, ఆయన వెంట అటవీ ప్రాంతాలకు వెళ్లాడు ఏకనాథుడు. తురుష్కవేషంతో అశ్వారూఢుడై ఒకవ్యక్తి వారివద్దకు వచ్చాడు. జనార్దనయోగి ఆయనకు వినయ వినమితగాత్రుడై నమస్కరించాడు. అది చూచి ఏకనాథుడు ఆశ్చర్యపడగా జనార్దనయోగి తన "యోగబలంచే షడ్రసోపేతమైన విందు భోజనం కల్పించాడు. గురువుతో కలిసి భుజింపసాగాడు. అప్పుడు దత్తాత్రేయుడు "జనార్దనా! చిత్తశుద్ధి గలవాడైతే నీ శిష్యుణ్ణి కూడ పిలువు" అన్నాడు. జనార్దనుడు రమ్మని చేతితో పిలిచినా ''ఈ తురుష్కునితో కలిసి భుజించడానికి నా మనస్సు అంగీకరించదు", అని ఏకనాథుడు దూరంగాపోయాడు. కొంతసేపటికి దత్తాత్రేయస్వామి తిరోహితుడయ్యాడు.

ఏకనాథుడు జనార్దనయోగి వద్దకువచ్చి "మహానుభావా! సాక్షాత్ బ్రహ్మణ్యమూర్తులైన మీరు, అధముడైన తురుష్కునితో కలిసి ఏకపాత్రంలో భుజింపవచ్చునా! అని ప్రశ్నించాడు. దానికి గురువుగారు "వెఱ్ఱివాడా! నేనెంత చెప్పినా వినకపోతివి. కేవలం ఒక మూఢునిగా ప్రవర్తించావు. మహాయోగులకు కూడ జన్మ జన్మాంతరాలకును లభింపని శ్రీగురుదేవుల దర్శనం సులభంగా లభించినప్పటికీ నీవు వారి అనుగ్రహాన్ని పొందలేకపోయావు. నీవు బాహ్యవిషయాలను చూడవద్దని ఎంత చెప్పినా వినలేదు. ఇప్పటికీ మించిపోయింది లేదు. ఈసారియైనా జాగ్రత్తగా ఉండు. స్వామి కృపాకటాక్షాలు పొందు" అని జనార్దనయోగి మందలించారు.

ఏకనాథునికి మంత్రోపదేశం చేసిన తన గురువు మీదనే గురుభక్తి కుదురుకున్నది కాని, గురువుకు గురువైన పరమగురువు ఎంత గొప్పవాడైనా తన శిష్యుడికి శిష్యుడని తనపై చూపే అనుగ్రహం అంతగా అవసరంలేదని ఆయన భావన!



## దత్తాత్రేయుని ద్వితీయ దర్శనం

జనార్దనయోగి మరొకరోజు ఏకనాథుని వెంటబెట్టుకొని అడవులకు వెళ్లినాడు. అక్కడ మరల ధ్యానింపగా, దత్తాత్రేయుడు కామధేనువును కుక్కగా చేసికొని తనవెంట తీసుకొని వస్తూ తాను ఫకీరువేషాన్ని ధరించాడు. జనార్దనయోగి మరల అతని పాదాలమీద వ్రాలి యథాపూర్వంగా మాట్లాడసాగాడు. కొంతసేపయిన తర్వాత ఫకీరు తన సంచిలోని రొట్టెను తీసి కుక్కపాలలో ముంచుకొని తినసాగాడు. దీన్ని చూచి ఏకనాథుడు ఏవగించుకున్నాడు. అయితే ఈసారి జనార్దనయోగి శిష్యుడు ఏకనాథుని రెక్కలు పట్టుకొని వచ్చి, స్వామి పాదాలమీద పడవేసి, "దేవా! ఈ దాసానుదాసుణ్ణి మీరే రక్షించాలి". అన్నాడు.

దత్తాత్రేయుడు సంతోషించి "ఇతడు గొప్ప భక్తశిఖామణియై భాగవతాన్ని మహారాష్ట్రభాషలో రచించి ఎన్నో హరి సంకీర్తనలు వ్రాసి సామాన్యమానవుల్లో పామరత్వాన్ని పారద్రోలి జ్ఞానజ్యోతిని వెలిగిస్తాడు." అని అదృశ్యుడయ్యాడు.

ఈ లోపుగా ఏకనాథుడు దత్తాత్రేయస్వామి తనకిచ్చిన రొట్టె ముక్కను ఎంగిలిదని భావించి అవతలకు పారవేశాడు. అప్పుడు జనార్దనయోగి "వత్సా! ఏకనాథా! శ్రీస్వామివారికి నీపట్ల అనుగ్రహం కలిగింది. వారి భుక్తశేషాన్ని స్వీకరించావా? లేదా? అని ప్రశ్నించాడు. అప్పుడు ఏకనాథుడు భయపడుతూ, తాను చేసిన అకృత్యాన్ని చెప్పాడు.

జనార్దనుడు చాల బాధపడి దత్తాత్రేయుడు ఉమ్మివేసిన తమలపాకు తమ్మను స్వీకరించి ఏకనాథుని నోటపెట్టాడు. వెంటనే ఏకనాథుని హృదయం నిర్మలమై అతనికి సర్వజ్ఞత్వం కలిగింది. దానితో అతనికి ఆచార్యసేవా ప్రభావమంటే ఏమిటో తెలిసింది. గురుభక్తి మిన్నుముట్టింది. "దత్తాత్రేయస్వామి అనుగ్రహాన్ని పొంది ఏకనాథుడు మహాత్ముడైనాడు. ఇతనిచేత మనం పరిచర్య చేయించుకోవడం అపచారం అని భావించాడు. "ఏకనాథా! నీవిక పైఠణ్‌పురంలోని మీ తల్లితండ్రుల్ని సేవిస్తూ శ్రీస్వామివారు

చెప్పినరీతిగా రామాయణ, భాగవత గ్రంథరచనలో నిమగ్నం కావలసిందని ఆదేశించాడు."

## పైఠణ్‌కు ఏకనాథుని పునరాగమనం

ఏకనాథుడు సొంత ఊరుకు తిరిగిరావడం ఇంటిలోని వారేకాదు, ఊరిలోని వారంతా ఆ రోజు పండుగ చేసుకున్నారు. ప్రతిరోజు చేసే కర్మానుష్ఠానాలు, విధిగా నిర్వహిస్తూ ఆయన నామజపానికి ఎక్కువసేపు కేటాయించసాగాడు. ఆరుబయటలోనే లేక పాండురంగని కోవెలలోనో ఆయన పురాణపఠనం చేస్తూ, ఆయా కథల్లో దాగిన జీవిత రహస్యాలను ఆధ్యాత్మికమైన సాంకేతిక అంతరార్థాలను, అరటిపండు ఒలిచినట్లు విడమరచి చెప్పసాగాడు. ఉదాహరణకు – భాగవత మహాపురాణంలో మొసలితో గజేంద్రుని సుదీర్ఘపోరాటం మానవజీవితం ఒక నిరంతర పోరాటమనే తత్వాన్ని, ప్రతిబింబిస్తూ ఉన్నదన్నాడు. ఈ బాహ్యాభ్యంతరపోరాటం ప్రతి మానవుని జీవితంలో తప్పనిసరిగా ఉంటుందన్నాడు. ఈ సంఘర్షణ ఎప్పుడు సమసి సమన్వయం, సామరస్యం సిద్ధిస్తుందో ఆ శాంతియుత సహజీవనానికోసమే పోరాటాన్ని సలిపి చివరికి శ్రీహరి కృపచే గట్టెక్కినాడని, ఇలా గజేంద్రమోక్షణ కథలోని అంతరార్థాన్ని బహురీతులుగా సమన్వయించి చెప్పాడు. పల్లెటూరి ప్రజలకే ఆయన పురాణాలు చెప్పాడు. వారికి భక్తి – జ్ఞాన – వైరాగ్యాలను గురించి విశదీకరించి ఓర్పుతో, సహనంతో ఎవరు భగవంతుని కృపకై వేచి ఉంటారో వారికి తప్పక ఆయన అనుగ్రహం కలిగితీరుతుందని, గోపికలకున్నంత ఓపిక ప్రతిభక్తునికి ఉండాలని, ఈ **నిరీక్షణ**మే **'జీవుని విరహవేదన'** అని, అదే **'మధురభక్తి'**గా పరిణమిస్తుందని పండితులు చెబుతారు. ఇలా చదువులుసాములు లేని పామరజనుల్ని ఏకనాథుడు భక్తులుగా, వేదాంత విషయశ్రోతలుగా, సమస్యలనెదుర్కొనే ధైర్యంగలవారుగా తీర్చిదిద్దాడు. పోరాటమే జీవన తత్త్వమని వారికి అర్థమయ్యేలా చేశాడు.



## విఠలుని సాక్షాత్కారం - ఆదేశం

ఒకనాటి రాత్రి చాలపొద్దుపోయిన తర్వాత ధ్యానాన్ని చాలించి, ఏకనాథుడు నిద్రకు ఉపక్రమించాడు. సుషుప్తిలో స్వప్నాలు రావు. స్వప్న సాక్షాత్కారాలు ఉండవు. 'గాఢనిద్రనే సుషుప్తి అంటారు. ఆ దశను వదలిపెడితే జాగ్రద్దశకు, సుషుప్తి దశకు మధ్యగల స్వప్నదశలో, సగం మెలకువ, సగం నిద్రాదశలో ఉన్నవేళలో పాండురంగ విఠలుని రూపంలో శ్రీమహావిష్ణువు సాక్షాత్కరించాడు. "నాయనా! ఏకనాథా! నువ్వు చేస్తున్న ప్రజాసేవ నాకెంతో ఆనందాన్ని కల్గిస్తోందయ్యా! నీ వల్ల కావలసిన మంచిపనులు ఇంకా ఎన్నో ఉన్నాయి. ముఖ్యంగా వాల్మీకి రామాయణాన్ని సామాన్యజనులకు అర్థమయ్యే రీతిగా సరళమైన భాషలో వచన రూపంగా అనువదించవలసింది! దీనిచే పామరులెందరో తరిస్తారు" అని చెప్పి అదృశ్యుడయ్యాడు.

దేవదేవుని ఆజ్ఞను శిరసావహించి ఏకనాథుడు భావార్థ రామాయణ రచనకు పూనుకున్నాడు. బాలకాండతో ప్రారంభించి ఒక్కొక్క ఘట్టం. రసోర్మీలనంగా చిత్రీకరిస్తూ వ్రాయసాగాడు. అతనిలో భగవత్కృపా వర్షంచే, దివ్య భవ్య కవితావేశం పొంగిపొరలింది. అహోరాత్రాలు అదే ధ్యానంతో తైలధారావచ్ఛిన్నంగా రామాయణ రచనలో నిమగ్నుడైపోయాడు ఏకనాథుడు.

భావార్థ రామాయణరచన ముగించిన తర్వాత ఏకనాథుడికి దత్తాత్రేయస్వామి ఆదేశం జ్ఞాపకానికి వచ్చింది. వెంటనే వ్యాసభాగవతాన్ని మరాఠీ భాషలో అనువదించడానికి ఉద్యుక్తుడయ్యాడు.

ఒక ప్రక్క భక్తిరసాభిషిక్తమైన భాగవత పురాణకథలు అనువాదమౌతుండగా, భక్తిరసప్రవాహం పెల్లుబికి భగవంతుని అనంతకల్యాణ గుణగణాలు, సంకీర్తనారూపంగా వెలువడసాగాయి. భగవంతుని సంకల్పమే అలా ఎడతెగని వర్షపాతంలా ధారాసారంగా, సారవంతమైన రచనలు వెలువడడానికి మూలహేతువయింది.

## వైకుంఠనాథుడైన కృష్ణుడు ఏకనాథుని యింట పరిచారకుడుకావడం

ఒకరోజు ఒక యువకుడు "ఏకనాథుడి గారి ఇల్లు ఇదేనాండీ!" అని గట్టిగా అడిగాడు. స్వామి ఏకనాథులప్పుడే అనుష్ఠానాలు ముగించి ఆరుబయటకు వస్తున్నారు. ఆ యువకుని పిలుపువిని" ఇదేనండీ! ఇదేనండీ!" అంటూ అరుగుమీద కూర్చున్నారు.

వచ్చిన ఆ యువకుడు "నేను ఏకనాథులవారిని దర్శించాలని వచ్చాను. వారు ఇంటిలోనే ఉన్నారా? అని అడిగాడు. "అయ్యా మీరు ఎవరికోసం వచ్చారో ఆ ఏకనాథుణ్ణి నేనే! మీరు వచ్చిన పని చెప్పండి" అన్నారు. దానితో ఆ యువకుడు ఏకనాథుల వారి పాదాలమీద పడి అయ్యా! నేను ఏకాకిని, నాకెవ్వరూ లేరు, ఊళ్లో కాయకష్టం చేసి జీవిస్తుంటాను. మీ గురించి విన్నాను. మీవంటి మహానుభావుల ఇంటిలో సేవకుడుగా ఉండాలని నా కోరిక! నాకు జీతభత్యాలేవీ అక్కర లేదు. తిండీ, బట్టలూ యిస్తే చాలు. ఇంటిపనులెన్నైనా చేయగలను. అవసరాన్నిబట్టి వేరే పనులున్నా చేస్తాను. నామీద దయపెట్టండి'' అని విన్నవించుకున్నాడు. అతని వినయ విధేయతలకు కష్టించే తత్త్వానికి ముచ్చటపడిన ఏకనాథుడు, అతడు తన ఇంట్లోనే ఉండవచ్చునని అనుమతించాడు. తాను చేసే అతిథి పూజలో సహాయపడితే చాలునన్నాడు. ఇంతకీ ఆయువకుని పేరు **'కృష్ణయ్య'** అని తెలిసి ఎంతో సంతోషించాడు ఏకనాథుడు. కొద్దికాలానికే ఇంటిల్లి పాదికీ కృష్ణయ్య అందరికీ తలలో నాలుకై కావలసినవాడయ్యాడు.

## ఏకనాథునిగారింట తండ్రి ఆబ్దికం

కృష్ణయ్య ఏకనాథుని గారింట పనికి కుదిరి అప్పుడే సంవత్సరకాలం గడచిపోయింది. ఆ రోజు ఏకనాథుని గారింట్లో వారి తండ్రిగారి తద్దినం.

కృష్ణయ్య సూర్యోదయాత్పూర్వమే వంటకు సన్నాహాలు ప్రారంభించాడు కనుక ప్రత్యూష పవనాంకురాలు వీచేవేళలో శుచిగా రుచిగా పక్వమౌతున్న



వంటకాల సువాసనలు వాయువీథుల్లో పయనించి నాసికాపుటాలకు తగిలిన వారికంతా నోరూరింపసాగింది. కొరట్లోమొదలుకొని పెరట్లోవరకు వంటకాలవాసనలు గుమ్ముగా వ్యాపించాయి. పెరట్లో, పూలతోటల్లో పనిచేసే తోటమాలి భార్యకు అతని ఇంటిల్లిపాదీ చెట్లకు పాదులుతీసేపని మానివేసి వంటకాల రుచులెలావుంటాయో అనుకొని లొట్టలు వేయసాగారు.

"ఇంటివారు తినగా మిగిలినవైనా మనకు దక్కితే బాగుంటుంది కదా!" అన్నది భర్తతో, "ఓసి వెర్రిదానా! నీవన్నీ గొంతెమ్మ కోరికలు! బాపనోళ్ల ఇళ్లలో తద్దినంనాడు ఎంగిలాకులయినా సరే, పెంటకుప్పమీద పడెయ్యరు! ఏట్లోనో, గోతిలోనో, నిప్పుల్లోనో ఏస్తారు. అంచేత నీకెంత నోరూరినా ఫలితం దక్కదే!" అన్నాడు తోటమాలి.

ఈ మాటలు, అప్పుడే పెరట్లోకి వస్తున్న ఏకనాథుని చెవిన పడ్డాయి. వెనక్కు నడచి వంటగదిలోని కృష్ణుణ్ణి పిలిచి తాను విన్న విషయాన్ని చెప్పాడు. దానికి కృష్ణుడు **"అందరూ పరమాత్మ స్వరూపులే కనుక, కోరినవాళ్లకు కోరినది పెట్టకపోతే ఆబ్దికఫలం దక్కదు. అందుచేత, వండిన వంటకాలన్నీ మాలమాదిగలకు ముందు వడ్డించాలని చెప్పాడు" కృష్ణుడు. కృష్ణావతారంలో గోవులకాపరిగా అడవిలో సోమిదమ్మలచేత 'పత్నీశాల'లో వారి స్వయంపాకవంటకాలచే గోపబాలుర ఆకలిని తీర్చినవాడు ఈ కృష్ణుడు కాదు కదా! అనుకున్నాడు ఏకనాథుడు.**

అందువలన ఆశపడిన తోటమాలి కుటుంబానికే కాక, మొత్తం చుట్టుపక్కలనుండి వచ్చిన పల్లెజనులకందరికీ సంతృప్తిగా చేసిన వంటకాలను వడ్డించి, సదక్షిణలతో సమ్మానించి పంపాడు ఏకనాథుడు.

ఇలా, మాల, మాదిగల (మహార్) భోజనాలయ్యాక స్థలశుద్ధి, భాండశుద్ధిచేసి, శిరస్నానాలు ఆచరించి, దేవతార్చన పేటికలోని దేవతామూర్తులను, సాలగ్రామాలను, జలనిమజ్జనం చేసి తీసి తుడిచి పెట్టి, పునఃపాకానికి ప్రారంభించాడు కృష్ణయ్య!

## పూర్వాచారపరాయణులు ఏకనాథుని వెలివేయడం

పండరీ పురంలోని పూర్వాచార్యపరాయణులకీ విషయం తెలిసింది. వారి దృష్టిలో అది ఆచారోల్లంఘనం. అదే ప్రశ్నను ఏకనాథుని పోయి అడిగారు. దానికాయన, "ఇది ఆచార ఉల్లంఘన కాదు, తద్దినంరోజున బీదసాదలకు అన్నదానం చేసే సంప్రదాయం మనదేశంలో ఉంది. సాధారణంగానే బీదాబిక్కికి, ఆదరణ కరువైన అనాథజనులకు అన్నదానం చేయడం మన ప్రాచీన సంప్రదాయం. సమయ సందర్భాలు అర్థం చేసుకొని సహకరించండి. నేను నా తండ్రి ఆబ్దికానికి అన్నదానం చేశాను. ఇది ఆచార ఉల్లంఘనమెట్లా అవుతుందో చెప్పండి? అని ప్రశ్నించగా వారు బ్రాహ్మణ సంతర్పణకని వండిన వంటను మహరులకు (మాలమాదిగలకు) వడ్డించడం ఆచారభ్రష్టత, భ్రష్టాచారమని కొందరు, దూషితాచారమని మరికొందరు దుర్భాషలాడడమేకాదు, ఆయనను, ఆయన కుటుంబాన్ని "బ్రాహ్మణ్యం" నుండి వెలివేశారు. వెలివేయడమంటే ప్రాణంమీదికి వచ్చినా పచ్చి మంచినీళ్లు ఎవ్వరూ ఇవ్వరు. ఇంట్లో అక్కరలు, అవసరాలు వస్తే ఎవ్వరూ వచ్చి ఆదుకోరు. ముఖావలోకనం పూర్తిగా రద్దుకావడాన్నే **'వెలి'** వేయడం అంటారు.

"దీనికి నేనేమీ బాధపడడంలేదు. అసలు ఇదంతా భగవంతుని సంకల్పం! నామీద కోపం చేసుకుంటే నష్టం ఎవరికి?" అన్నాడు ఏకనాథుడు. "ప్రస్తుతం మీ పితృశ్రాద్ధం మేం జరిపించం కదా! ఏం చేస్తావో చూద్దాం" అన్నారు.

యజమాని ముఖంలోని గాంభీర్యాన్ని గమనించి కృష్ణయ్య! "స్వామీ! మీకు ఈ ఊరివాళ్లతో ఏంపని? ఒక్కసారి మీరు శ్రీమన్నారాయణమూర్తిని ధ్యానించి, మీ పితరులను ఆహ్వానించండి. వారే వస్తారు." అన్నాడు. ఈ ఆలోచన ఏకనాథునికి నచ్చింది. ఆ ప్రకారమే చేశాడు. అతని ప్రార్థనలోని



నిజాయితీని మన్నించి పితృదేవతలు స్వయంగా వచ్చి పితృయజ్ఞాన్ని సఫలీకృతం చేశారు.

## ప్రాయశ్చిత్తం జరిపి ఏకనాథునికి బ్రాహ్మణ్యం తిరిగి యిప్పిస్తామని పూర్వాచారపరాయణులు పూనుకోవడం

ఏకనాథుని పితృయజ్ఞానికి పితృదేవతలే దిగివచ్చి పిండాలు స్వీకరించారన్న వార్త ఊరంతా గుప్పుమని వ్యాపించింది. ఏకనాథుడు శ్రీమన్నారాయణుని ఆంతరంగిక భక్తుడన్న సంగతి విశదమయింది. అటువంటివాణ్ణి దూరం చేసుకోవడం తెలివితక్కువతనంగా తలచి, ప్రాయశ్చిత్త కాండతో అతణ్ణి మళ్లీ తమతో కలుపుకోవడానికి సిద్ధపడ్డారు. అసలు ప్రాయశ్చిత్తమే అవసరంలేదని ఏకనాథుడికి తెలుసు. అయితే 'కోతిపుండు బ్రహ్మరాక్షసి'గా చేయదలచుకోలేదాయన! ఎలా జరిగితే అలా జరగనీ! అని తన ప్రమేయాన్ని వదలుకున్నాడు.

## దైవ సంకల్పచేత వచ్చిన ఒక కుష్ఠురోగి ఏకానాథుడెవరో లోకానికి తెలియజేయడం

ఏకనాథుణ్ణి పిలుచుకొని ఊరిబయట ఏటిదగ్గరికి బ్రాహ్మణ్యమంతా వెంట వచ్చింది. ఇక ప్రాయశ్చిత్తకాండ ప్రారంభించాలి అనుకుంటూ ఉండగా – అదే సమయానికి అక్కడికొక కుష్ఠురోగి వచ్చాడు. అతడు వచ్చిరావడంతోనే, "ఓ బ్రాహ్మణులారా! మీలో ఏకనాథ స్వాములెవ్వరు? ఆయనను చూడాలనే నేను వచ్చాను" అన్నాడు. వారందరూ ఈ అనాకారి, అనాచారి కుష్ఠురోగితో ఏకనాథులకేంపని? అని ముఖం మురకటించుకొని ముందుగా నిలబడిన ఏకనాథుని చూపించి **'ఇతడే మీ ఏకనాథుడు'** ఏం మాట్లాడుతారో మాట్లాడుకోండి" అన్నాడు.

వచ్చిన ఆ కుష్ఠురోగి ఏకనాథునితో "స్వామీ! చాలకాలం నుండి ఈ రోగంతో బాధపడుతున్నాను. ఏ వైద్యమూ పనిచేయలేదు. ఏ దైవమూ

కనికరించలేదు. ఎవరో ఒక సాధువు, 'శివానుగ్రహం చేతనే నీకీ రోగం నయమవుతుం'దన్నాడు. ఇంక నాకు మహాదేవుడే దిక్కని నమ్మి చాలకాలం తపస్సు చేశాను. ఇప్పటికి నామీద అనుగ్రహం కలిగి ఆయన ప్రత్యక్షమయ్యాడు. ఆయన ఒకేమాట చెప్పాడు – **పైఠణపురంలో ఏకనాథుడనే భాగవతోత్తముడున్నాడు. ఆయన అన్నదానం చేస్తుంటాడు. ఆయన ఒక చండాల స్త్రీ, శిశువుల్లో ఎవరికైనా ఒకనాడు చేసిన అన్నదానానికి కలిగే పుణ్యంలో ఒక భాగాన్ని నువ్వు పొందగలిగితే నీ కోరిక తీరడమేగాక, అవసానదశలో శ్రీహరి సాయుజ్యాన్ని పొందుతావు"** అన్నాడు. అందుచేత మీకోసం వెతుక్కుంటూ వచ్చాను. నన్ను అనుగ్రహించండి'' అని వేడుకొన్నాడు.

అది విని ఏకనాథుడు ''అయ్యా! పరమేశ్వరుడంతటివాడు, సర్వానుగ్రహసమర్థుడయి ఉండి కూడా, నాచేత ఈపని నెరవేరాలని నిశ్చయించడం కేవలం నన్ను అనుగ్రహించడమే తప్ప, మరొకటి కాదు. ఒక్క చండాలస్త్రీకి చేసిన అన్నదానం చేకూర్చేఫలంలో ఒక్క భాగమేకాదు, మొత్తం నాపుణ్యమంతా నీకు ధారపోయడానికి సిద్ధంగా ఉన్నాను." అన్నాడు ఏకనాథుడు.

ఆ కుష్ఠురోగి అందుకు అంగీకరించలేదు. శివుని ఆజ్ఞ మేరకే తాను ఫలభాగం స్వీకరించదలచానని చెప్పాడు. అతడు కోరిక ప్రకారం కోరినంత మేరకే అన్నదానఫలం అతనికి ధారపోశాడు ఏకనాథుడు. మరుక్షణంలోనే ఆ కుష్ఠురోగి ఆరోగ్యవంతుడై నిలబడ్డాడు. ఆ హఠాత్ దృశ్యాన్ని చూచినవారంతా నోటమాటరాక స్థాణువుల్లా నిలబడ్డారు. ఏకనాథుడు వాళ్లందరినీ స్నేహహస్తంతో స్పృశించి తన ఇంటికి పిలుచుకొనిపోయి షడ్రసోపేతమైన విందుభోజనం పెట్టి సత్కరించాడు.



## ఏకనాథుని ఇంటిపని చేస్తున్న కృష్ణయ్య ఎవరోకాదు! సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్మయే!

కాలం గడచిపోతోంది. నిన్నగాక మొన్న వచ్చినట్టున్నాడు కృష్ణుడు, ఏకనాథుని ఇంట్లోపని చేయడానికి! అప్పుడే పన్నెండేళ్లు గడచిపోయాయి. ఒకరోజు ఓ బ్రాహ్మణుడు ఏకనాథుని ఇల్లువెదుక్కుంటూ వచ్చాడు.

"కృష్ణుడుండే ఇల్లు ఇదేనా!" అని ఏకనాథుణ్ణే అడిగాడు.

"అవును, కాని కావడి వేసుకొని ఏటికి నీళ్లు తేవడానికి వెళ్లాడు. ఇప్పుడే వస్తాడు. కూర్చోండి!" అన్నాడు ఏకనాథుడు.

''అవును, మీరు కృష్ణునికేమౌతారు? మరి ఇన్ని ఏండ్లు ఎందుకురాలేదు? బడలికతో ఉన్నారు కాబోలు! ఫలహారం చేద్దురుగాని, లోపలికి రండి" అని ప్రేమతో పిలిచాడు, ఏకనాథుడు.

ఇంతలో నీళ్లకావిడితో కృష్ణుడు రానేవచ్చాడు. వచ్చిన బ్రాహ్మణుడు ఒక ఉదుటున లేచి, కృష్ణుని ఎదురుగా నిలబడి "ఏమయ్యా! కృష్ణా! జగద్రక్షకా! అయినా ఇంత పక్షపాతం తగునటయ్యా నీకు! పదహారేళ్లుగా ఎడతెరపి లేకుండా నిన్నుగూర్చి తపస్సు చేస్తున్నా కనికరించకపోవడం అటుంచి, నిన్నే నమ్ముకొని ఉన్న నీ అష్టమహిషులకు చెప్పాపెట్టకుండా, ఈ పైఠణపురంలో పన్నెండేళ్లుగా ఈ ఏకనాథ భాగవతుని ఇంట్లో వెట్టిచాకిరీ చేస్తూ ఉండడంలో ఏమయ్యా నీకంత ఆనందం! ఒక్క క్షణమైనా ఈ మహానుభావుణ్ణి వదలి మావైపు కాస్త కన్నెత్తి చూడగూడదా తండ్రీ!" అంటూ భోరున కాళ్లమీదపడి ఏడ్వసాగాడు.

ఏకనాథుడు నిశ్చేష్టుడై నిలబడ్డాడు. కృష్ణుడు చిరునవ్వునవ్వుతూ ఒక్క అడుగుముందుకేసి, భుజంమీద బరువుగా ఉన్న కావడిని అరుగుపై దింపి, తక్షణమే అదృశ్యుడయ్యాడు!

వచ్చిన ఆ బ్రాహ్మణుడు వలవల ఏడుస్తూ తన హృదయవేదననిలా చెప్పసాగాడు. "శ్రీకృష్ణసాక్షాత్కారంకోసం తాను పదహారేళ్లు కఠోరతపస్సు చేసినా ఫలితం లేకపోగా, ఒకనాడు శ్రీకృష్ణుని పట్టమహిషులు తనకు కలలో సాక్షాత్కరించారు. కృష్ణదర్శనంకోసం శరీరాన్ని కృశింపజేసుకుంటూ ఎన్నేళ్లు నువ్వు తపస్సు చేసినా ఫలితం ఉండదు. ఆయనిప్పుడు మాదగ్గర లేడు. మమ్మల్ని విడిచి పన్నెండేళ్లయింది. పైఠణపురంలో ఏకనాథుడనే ప్రియభక్తుడి ఇంట్లో ఉంటున్నాడు. నువ్వు అక్కడికే వెళ్లాలి" అని వారు చెప్పగా సరాసరి ఇక్కడికి వచ్చాను. వచ్చినందుకు ఒక్కక్షణకాలమైనా కృష్ణదర్శనమైనందుకు సంతోషించాను.'' అని ఏకనాథస్వామికి పాదాభివందనం చేశాడు.

అన్నిటికంటే ఆశ్చర్యం ఏకనాథునికే తెలియక శ్రీకృష్ణపరమాత్మ ఆయన ఇంట పరిచారకుడుగా పన్నెండేళ్లు పనిచేయడం, ఏమిటీ వింత? ఎంత అపచారం! నేను లక్ష్మీవల్లభునిచేత నాయింట వెట్టిచాకిరీ చేయించానా! ఎంత దౌర్భాగ్యుణ్ణి! లోకానికంతా నీతులు చెప్పే నేను, దాతగా చలామణీ అయ్యేనేను, దేవుడెవరో, మానవుడెవరో తెలుసుకోలేకపోయానే! అని వాపోయాడు. ఆ పాండురంగ విట్టలుడే నన్నీ విధంగా మాయింటనే ఉండి నాకు సేవచేశాడు! మరి నేనాయనకు ఏసేవ చేశాను? అని ప్రశ్నించుకొన్నాడు! "చేయకేమి! నీవు చేసిన సేవ సామాన్యమైనదా? "రామాయణ, భాగవతాలు, రుక్మిణీస్వయంవరము, కీర్తనలు ఇవన్నీ నా గురించి నీవు అక్షరరూపాత్మకంగా చేసిన సేవ కదా! భాగవతంలోని ద్వాదశస్కంధాలకు ముగ్ధుడనై ద్వాదశ సంవత్సరాలు నీయింట ఉండి నీకు చేదోడు వాదోడుగా ఉన్నాను. నా భక్తుని సేవించుకోవడమంటేనే నాకెంతో కిష్టం! నీవు చేసిన భాగవతరచనకు భాగవతసేవకు నేను చేసింది చాలస్వల్పమే! నీ సాహిత్యం లోకాన్ని ఉద్ధరించేది. దాని ముందు నా సేవ ఎంత? నీవు చిరాయువై జీవించి చివరిదశలో నన్ను చేరుకొందువుగాక!" అని ఏకనాథునికి సమాధానం వినబడింది.



## ఏకనాథుని జీవితం - రచనలు

సంత్ శ్రీ ఏకనాథ్ మహారాజ్ క్రీ.శ.1533లో పైఠణ్‌పురంలో జన్మించి 1599 వరకు జీవించి పాండురంగ విట్టలునిలో లీనమయ్యారు. జీవించినది 66 సంవత్సరాలే! ఇతడు మహారాష్ట్ర సాహిత్యంలోని భాగవతపంథ లేక వార్కరీ పంథా ఉద్యమానికి చెందినవారు. ఈయన రచనల్లో ఇతని అత్యున్నత వ్యక్తిత్వం. ఉదార జీవన ప్రవృత్తి - సామాజిక దృష్టి - ప్రస్ఫుటమౌతాయి. సాహిత్య ప్రక్రియల్లో ఈయన **"కీర్తనం - పురాణ రచనం - ప్రవచనం** అనే మార్గాలలో గొప్ప పరిణతిని సాధించారు. ఈయన ఒక ఉద్యమ చైతన్యస్ఫూర్తిగా ఎలా నిలబడగలిగాడంటే 14-15 శతాబ్దాలలో మహమ్మదీయుల పరిపాలనలో భాగవతభక్తి ప్రచారోద్యమానికి వెన్నుదన్నుగా తన సర్వకవితాశక్తిని, మౌలిక గ్రంథరచనచేత ఉద్యమస్ఫూర్తిని ఉద్దీప్త పరిచాడు. దీనినే వార్కరీ ఉద్యమ పంథా లేక భాగవత పంథా అంటారు.

## ఏకనాథుని రచనలివి

1) చతుశ్శ్లోకీ భాగవతం 2) ఏకనాథ భాగవతం 3) రుక్మిణీస్వయంవరం 4) భావార్థరామాయణం. భాగవత - రామాయణాలు బృహద్గ్రంథాలు. ఛందోరీతులలో ఈయన మహారాష్ట్ర భాషాసాహిత్యాలలోని 'అభంగములు, గౌలని, భరూద్ వంటి సామాన్యజనులకు ప్రియమైన శైలీ విన్యాసం గల ప్రక్రియలనే ఎన్నుకొని వ్రాశాడు. సామాన్యజనులలో ఈ కృతులు ప్రచారం కావడానికిదే మూలకారణం. ఇతడు కథాకథనదక్షుడే గాక, వాగ్గేయకారుడు కూడ. ఇతడు వేదాంతభావనల్ని సామాజిక లౌకికోదాహరణలతో సమన్వయించి చెప్పడంలో తనదైన ఒక విలక్షణ శైలిని నిర్మించాడు.

* * *

# 7. సక్కుబాయి

కృష్ణానదీతీరంలోని కరవీరపురం (కొల్హాపూర్)లో ఒక బ్రాహ్మణు డుండేవాడు. అతడు గొప్ప విద్వాంసుడేగాని, సత్యధర్మ దయాశౌచాలు లేని కఠినాత్ముడు. అన్నివిధాల అతని ప్రవర్తనం హేయమైంది. అతని భార్య సకల విధాల అతనికి తీసిపోనిది. ఇద్దరూ ఇద్దరే. అవకాశమొస్తే అందలమెక్కి అధికారం చెలాయించడానికి సిద్ధం. వారికొక్కడే కుమారుడు. అతడు బాల్యంలోనే సకల విద్యలు నేర్చుకున్నాడు. స్వతంత్రమైన ఆలోచన జ్ఞానం లేనివాడు. తల్లిదండ్రులకు అత్యంత విధేయుడు. ఆకుచాటు పిందె.

ముసలివాడైన తండ్రి తన కుమారుడు వివాహయోగ్యుడై ఉండడం తెలుసుకొని, భార్యతో యోచించి, పెండ్లికుమార్తెను వెదకి కుదర్చడానికి బయలుదేరాడు. అతడొకనాటి సాయంకాలానికి పండరీ పురానికి చాల దగ్గరలో ఉన్న ఒక జనపదాన్ని చేరుకున్నాడు. చీకట్లో ప్రయాణం చేయడానికి భయపడి, ఆరాత్రి ఆ ఊరిలోనే గడపాలని ఒక బ్రాహ్మణుని ఇంటికిపోయాడు. ఆ ఇంటి యజమాని, అతిథిమర్యాదలు చేసి, భోజనానికి ఉండవలసిందిగా కోరాడు. ఆ గేస్తునకొక కుమార్తె ఉంది. చక్కనిచుక్క. విద్వాంసురాలు. వినయవతి. సుగుణఖని. ఆమెను చూచిన వెంటనే వచ్చిన ఆ వృద్ధ బ్రాహ్మణుడు, తనకుమారునకా కన్యనిచ్చి వివాహంచేస్తే బాగుంటుందనుకున్నాడు. భోజనానంతరం ఆ గృహస్థునితో అతిథి తన అభిప్రాయాన్ని చెప్పాడు. అతడు తన ఇల్లాలితో ఆలోచించి 'సరే' అన్నాడు. తర్వాత వారిద్దరు పెండ్లికి సంబంధించిన విషయాలు నిశ్చయపరచుకొని, ముహూర్తం కూడ ఏర్పాటుచేసికొన్నారు. అతిథిగా వచ్చిన వృద్ధుడు ఆనందంతో ఇంటికి తిరిగి వెళ్లాడు.

కరవీరపురం చేరిన వెంటనే వృద్ధుడు సంగతులన్నీ భార్యకు వివరించాడు. ఆమె చాల ఆనందించింది. తర్వాత వారు సుముహూర్త



సమయానికి బంధువులందరితో తరలివెళ్లి, కుమారునికి కల్యాణ మహోత్సవంలో పాల్గొని వచ్చారు, పెండ్లి కొడుకు అత్తవారింట కొన్ని రోజులుండి తర్వాత 'సక్కుబాయి' అనే పేరు గల్గిన భార్యతో కరవీరపురాన్ని చేరుకున్నాడు. ఆమె తల్లి తండ్రులు ఓపినకొలది చీరసారెలు సక్కుబాయితో బాటు యిచ్చి పంపారు.

## సక్కుబాయి నిరంతర శ్రీహరినామస్మరణ

సక్కుబాయి బాల్యంనుండి నిరంతరం శ్రీహరినామస్మరణం చేస్తుండేది. ఒకనాడు ఒక అతిథి ఆమె భక్తిశ్రద్ధల్ని చూచి ఆమెకు శ్రీకృష్ణమంత్రాన్ని ఉపదేశించాడు. ఆ మంత్రమిది : **"శ్రీకృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయ స్వాహా"**

అప్పటినుండి సక్కుబాయి శ్రీకృష్ణమంత్రాన్ని ఎల్లప్పుడూ జపించసాగింది. అత్త ఇంటికి వచ్చిన తర్వాత కూడా ఆమె శ్రీకృష్ణమంత్రజపం మానలేదు. అదిచూచి అత్తమామలు చాల కంటగించుకొని, "ఈ శ్రీహరి పూజ వలన ఇప్పుడు గృహకృత్యాలు సాగవు. ముందు ముందు విరక్తిపుట్టి చెడిపోతాడని హెచ్చరించారు. ఇకనైనా కృష్ణస్మరణమానుకోమని హితవు చెప్పారు. అప్పుడు సక్కుబాయి వారి దౌర్జన్యానికి లొంగిపోయి, అంతరంగంలోనే శ్రీకృష్ణమంత్రాన్ని జపిస్తూ, వారు చూడనప్పుడు ఎట్లో వీలు చేసికొని కృష్ణనామాన్ని కీర్తింపసాగింది. హఠాత్తుగా ఒకరోజు అత్తగారు చూచింది. అప్పటినుండి అత్తమామలు "మన ఆజ్ఞల్ని ధిక్కరించిందని" నిశ్చయించి అనేక విధాలుగా గృహసంబంధమైన ఇక్కట్లు కలుగజేయసాగారు.

ఇంటిపనులు, వంట వార్పులు సక్కుబాయియే చేసినప్పటికీ ఆమెకు కొన్నిరోజులు అన్నపానీయాలు ఇవ్వడం మానివేశారు. అయినా ఆమె దుఃఖింపక వారి ఆజ్ఞల్ని అనుసరించి నడచుకొనేది. "ఈ పిల్ల మొండి కెత్తింది" అని నిశ్చయించి అత్తమామలు ఆమెను మగనిచే కర్రలతో

చావమోదేట్లు చేశారు. ఇదిచూచి ఇరుగుపొరుగువారు కొందరు "మీ కోడలు అచ్చం లోకజననియైన శ్రీమహాలక్ష్మివలె కనబడుతుండగా, ఆమెను మీరిలా బాధించడం మంచిదికాదని చెప్పారు. అప్పుడు ఆ దంపతులు మా ఇంటి గొడవలు మీకెందుకని దూషించి, పంపివేసి, కోడలుపిల్ల ఇంటి గుట్టంతా పొరుగువారికి తెలుపుతూ ఉందని మరింతగా హింసించ సాగారు.

## సక్కుబాయి పండరీపురానికి పోవడానికి సంకల్పించడం

ఒకనాడు సక్కుబాయి ఆమె పొరుగింటి ఆడపడుచు శాంత అనే యువతితో కలిసి చెరువుకు నీళ్లకోసం వెళ్లింది. అక్కడ చెరువుగట్టుమీద ఐదారుగురు భాగవతులు కూర్చుండి శ్రీహరి సంకీర్తనలు గొంతెత్తి శ్రావ్యంగా పాడుతున్నారు. సక్కుబాయి ఆ కీర్తనలకు మనస్సుకరిగి, "శాంతా! నీవు ఇంటికి పో! నేను వారితో పండరీపురానికిపోయి పాండురంగని సేవించివస్తాను. ఈ సంగతి మా అత్తమామలకు చెప్పు" అన్నది. శాంత, ఆమె చెప్పినట్లే సక్కు అత్తమామలకు చెప్పింది. ఆ మాట విన్నతోడనే, వాళ్లిద్దరు మండిపడి కొడుకును కూడా పిలుచుకొని, చెరువుకు పోయారు. భర్త, సక్కుబాయిని చావమోది, జడపట్టి ఈడ్చుకుంటూ ఇంటికి తీసుకువచ్చారు. తల్లితండ్రులు భాగవతుల్ని అనేక విధాలుగా తూలనాడారు. ఇంటికి వచ్చాక సక్కుబాయిని పెడరెక్కలు విరిచి స్తంభానికి వేసికట్టి, అన్నపానాలు ఇవ్వకుండా హింసించసాగారు. సక్కుబాయి నిస్సహాయురాలై, నిశ్చల చిత్తంతో శ్రీహరిని ధ్యానిస్తూ, **"పాండురంగా! నాకు ఎలాంటి కష్టాలువచ్చినా బాధలేదు గాని, నీ ఉత్సవాలను చూడటానికి శక్యంకాకపోయిందే. అని దుఃఖిస్తున్నాను." అని బాధపడసాగింది.** ఆ ప్రార్థనకు హృదయం కరుగగా, విఠలనాథుడు సక్కుబాయి రూపాన్ని ధరించి అర్ధరాత్రి వచ్చి సక్కుబాయిని మేల్కొల్పి "నీవు పండరీపురానికిపోయి తిరిగి వచ్చేంతవరకు నేను ఈ బంధనంలో ఉంటాను. నీవుపోయి నీ ఇష్టదైవాన్ని దర్శించిసేవించి రావలసింది" అని చెప్పాడు.



సక్కుబాయి "ఇదెలా సంభవం?" అని సందేహింపగా విఠలనాథుడు అనేక విధాలుగా నచ్చచెప్పి ఆమెకు కట్లువిప్పి పంపివేసి తనకు తానే బంధితుడైనాడు. సక్కుబాయి పండరీపురానికి పోయి, భాగవతులతో కలసి మార్గంలో అనేక పుణ్యనదులు దాటి పండరీపురాన్ని చేరుకొన్నది.

## పండరీపుర యాత్రకు వెళ్లిన సక్కుబాయికి వైరాగ్యము మిన్నుముట్టి దేహయాత్ర చాలించుట.

పండరీపురానికి ఎకాయెకి చేరుకున్న సక్కుబాయి మానసిక, శారీరక స్థితిగతులేవీ సరిగాలేవు. బాగా అలసి, నీరసించి, కృశించిన శరీరంలో ప్రాణం మాత్రం మిణుకుమిణుకుమంటోంది. హృదయంలో **భగవద్భక్తి చింతన చేత నిండిన ఆహ్లాదమొక్కటే ప్రహ్లాదమై ఆమెకు మనోబలాన్ని సమకూర్చిపెట్టింది. ఇక జీవించాలనే ఆశ ఆమెలో ఎప్పుడో చచ్చిపోయింది. వైరాగ్యం మిన్నుముట్టింది. పండరీపుర పుండరీకాక్షుని సకలవిధ ఉత్సవాలను కళ్లారాచూచింది. భగవద్వైభవదర్శనంతో మహానందభరితురాలై జీవితం ధన్యమైనదని భావించింది. పాండురంగని పాదాలమీదవ్రాలి, "శ్రీహరీ! ఇక నేనీ కరుణాహీన ప్రపంచంలో ఈ యమయాతనలను భరించలేను. నన్ను నీలో కలుపుకో!"** అని మనస్ఫూర్తిగా ప్రార్థించింది. అప్పటికే కొడిగట్టిపోతున్న ఆమె ప్రాణపు దివ్వె అవశంగా స్వామి పాదాలలో లీనమైపోయింది. కాసేపు ప్రకృతి అంతాస్తబ్ధమైనట్లు తోచింది. ఆమె **మరణానికి ఒక్క కన్నీటిబొట్టు రాల్చే వారెవ్వరు లేరు; భగవంతుడు పాండురంగడు తప్ప!** ఆ దీనావనుని దివ్యస్వరూప సందర్శనం ఆమెలోని జన్మదుఃఖాన్ని పటాపంచలు చేసింది. సాంసారిక దుఃఖాన్ని ఆమె భగవన్నామస్మరణచే జయించింది.

ఇంతలో ఆ పండరీపురంలో ఆమె ఎవ్వరో తెలిసిన ఒక ముత్తైదువ సక్కుబాయి దివ్యధామాన్ని అలంకరించిందని తెలుసుకొని వచ్చి, "పరిమళించి ప్రకాశించవలసిన దశలో నరరూప రాక్షసులబారిపడి

నలిగిపోయి రాలిపోయావా సక్కూ! నిజమేలే! సక్కు ఇక ఎవరికోసం జీవించాలి? ఆమెకేమి బిడ్డలా? పాపలా? ఎలా వచ్చిందో అలాగేపోయింది! కర్కోటకుడైన భర్తా, కాలకూటవిషాన్ని కక్కే అత్తామామలు ఆమెను రాచి రంపాన పెట్టారు. ఉదయాస్తమానాలు వెట్టిచాకిరీ చేస్తూ, తన కడుపుకు పట్టెడు కూడు పెట్టేవారులేక ఆమె ఎవరికోసం ఇంకెంతకాలం, ఎందుకు జీవించాలి? అందుకే, సక్కుబాయిలో జీవితాశ ఎప్పుడో చచ్చిపోయింది. ఆ అవసాన దశ, స్వామిసన్నిధిలో జరిగింది. **ఆమెను ప్రేమతో 'సక్కూ!' అని పిలిచేవాడు ఆ పాండురంగడొక్కడే! ప్రేమ ఎక్కడ ఉంటే ప్రాణం అక్కడికి చేరుకుంటుంది. ఇదే సక్కుబాయి జీవిత రహస్యం!** "ఆమె ఎలుగెత్తి ఏడ్చింది.

జ్యోతిర్మయమైన సక్కుబాయి జీవాత్మ పాంచభౌతిక దేహాన్ని విడిచి శ్రీపండరీనాథునిలో ఐక్యమైంది. క్రూరాత్ముల జనారణ్యంనుండి ఒక జీవుడు విడుదల పొందాడు. అక్కడ నిల్చున్న భాగవతాగ్రేసరులు "ఈ సక్కుబాయి ఇంత దుఃఖజీవియా? దుఃఖానికి నిష్కృతి మరణం కాకపోయినా, లోకపుక్రూరత్వానికి బలియైపోయిన అమాయిక బాలిక, సక్కు ఒక మల్లె పూలతీగ! ఈ లతాంతం పుష్పించి పరిమళించక ముందే కాలగర్భంలో కలిసిపోయింది.'' అని భాగవతులు భావిస్తూ, ఆమె కళేబరాన్ని చంద్రభాగానదీతీరానికి తీసికొనిపోయి దహనసంస్కారం జరిపారు.

### భక్తురాలి కోసం భగవంతుని ఆగచాట్లు

సక్కుబాయి రూపంతో ఉన్న పాండురంగడు నిద్రాహారాలు లేక పదేనురోజులు బంధితుడై ఉండిపోయాడు. సక్కుబాయి పెనిమిటి "ఈమె పదేను రోజులనుండి నిద్రాహారాలు లేకుండా ఉంది. ఇంకా ఇట్లే ఉంచితే..." తప్పక మరణిస్తుంది. ఇంతటి సుందరి – ఇంతటి గుణవతి, ఇంత విద్యావతి ఇక లభించడం దుర్లభం! అని భావించి బంధన మూడదీసి, పోయి స్నానం



చేసి వచ్చి వంట చేయుమని ఆదేశించాడు. సక్కుబాయి రూపంలో ఉన్న భగవంతుడు చెప్పినవన్నీ చేశాడు. ఆమె వండిన పదార్థాల మాధుర్యాన్ని చవిచూచి వారు, ఆశ్చర్యచకితులై, ఆ క్షణంనుండి ఆమెనెంతో ఆదరింపసాగారు.

### రుక్మిణి హస్త స్పర్శచే సక్కుబాయి పునర్జీవితురాలగుట

ఇదిలా ఉండగా, అక్కడ పాండురంగని గుడిలో రుక్మిణికివన్నీ తెలుసుకాబట్టి, ''సక్కుబాయిరూపంతో నా నాథుడు వారియింట్లో చిక్కుకొన్నాడు. ఇక్కడ గుడిముందు సక్కుబాయి మరణించింది. ఏంచేసేదని యోచించి, సన్నిధిని ఆశ్రయించియున్న భాగవతాగ్రేసరులను పిలిచి, **"మీరు సక్కుబాయి కళేబరానికి దహనసంస్కారంచేసి వచ్చారు కదా! ఆమె అస్తికలను తీసికొనివచ్చి నా ముందు పెట్టండి" అని ఆజ్ఞాపించింది. ఆమె ఆజ్ఞప్రకారం వారు రుద్రభూమికి పోయి చూచేటప్పటికి సక్కుబాయి అస్థికలు నారాయణస్మరణం చేస్తున్నాయి.** అది విని పరమాశ్చర్యభరితులై భాగవతులు అస్థికలను బంగారు పళ్లెరంలో పెట్టి తెచ్చి రుక్మిణిపాదాల దగ్గర పెట్టారు; రుక్మిణి వాటిని తాకిన వెంటనే సక్కుబాయి సజీవయై, సదేహయై లేచి నిలబడింది. భాగవతులందరు సక్కుబాయి భాగ్యాన్ని, రుక్మిణి కరుణా హృదయాన్ని అనేక విధాలుగా ప్రశంసించారు.

రుక్మిణి సక్కుబాయిని కౌగిలించుకొని, **తల్లీ! శ్రీహరి నీ రూపంతో కరవీరపురంలో ఉన్నాడు. నేను ఆయన ఎడబాటు సహింపలేకుండా ఉన్నాను. నీవు వెంటనేపోయి నానాథుని పంపవలసింది."** అని ఆదేశించింది. ఆ ప్రకారం సక్కుబాయి బయలుదేరింది. ఆమె కరవీరపురం చెరువు గట్టుమీదికి వచ్చేటప్పటికి సక్కుబాయి రూపంతో ఉన్న శ్రీహరి. నీళ్లకోసం బిందెతో అక్కడికిరావడం తటస్థించింది. "తల్లీ! నీ మనోరథం నెరవేరింది కదా!" అని అడిగి, బిందెను ఆమెకు ఇచ్చివేసి, అదృశ్యుడయ్యాడు. పునర్జన్మ

యెత్తిన సక్కుబాయి మునుపటికంటె రెండింతల ఉత్సాహంతో, స్ఫురద్రూపంతో రుక్మిణీస్పర్శచే నిత్యమైన ఆనందంతో బిందెను తీసికొని, జలకమాడి, నీళ్ల బిందెను నడుముపై పెట్టుకొని ఇంటికి వెళ్లింది.

### కరవీరపురంలో కలసిన కుటుంబం

రుక్మిణి పాదాల సన్నిధిని సక్కుబాయి అస్థికలను తెచ్చిపెట్టిన భాగవతులలో ఒకరు, సక్కుబాయి మాహాత్మ్యాన్ని ఆమె అత్తమామలకు, మగనికి – చెప్పాలని వెంటనే బయలుదేరి కరవీరపురానికి వచ్చాడు. అతడు సక్కుబాయి ఇంటికి వచ్చేటప్పటికి ఆమె లోపలనుండి ఎదురువచ్చి "మహానుభావా! దయతో లోపలికిరండి" అని ఆహ్వానించింది. అందుకాతడు ఆశ్చర్యచకితుడై, పండరీపురంలో జరిగినదంతా అందరికీ వివరించి చెప్పాడు. అదివిని అత్తమామలు యథార్థం చెప్పుమని అడుగగా, సక్కుబాయి తనకు తెలిసినదంతా చెప్పింది. అదివిని వారంతా మహానందభరితులై ఆమెను అనేక విధాలుగా ప్రశంసించి, "నీ భక్తి మాహాత్మ్యం తెలియక నిన్ను అనేక విధాలుగా బాధించాము. క్షమించు" అని ప్రార్థించారు. పైగా, "నీవు బాల్యకాలంలోనే మోక్షమార్గాన్ని సాధించావు. ఇంత వయస్సుగడిచిన మాకు ఆ తరణోపాయాన్ని మాకుకూడ తెలియజేయవలసింది." అని వేడుకొన్నారు, సక్కుబాయి భర్త, ఆమె అత్తమామలు.

అప్పుడామె దీనికి "ఆచార్యోపదేశం చేతనే ప్రయోజనసిద్ధి కల్గుతుందని" చెప్పి వారిని పిలుచుకొనిపోయి పండరీపురంలోని ఆచార్యుని పాదాలకు నమస్కరింపజేసి, వీరందరూ మిమ్మాశ్రయించడానికి వచ్చారు. వీరిని అనుగ్రహించవలసిందని'', ప్రార్థించింది. ఆచార్యుడు వారికి జ్ఞానబోధగావించి శ్రీకృష్ణమంత్రాన్ని ఉపదేశించాడు. తర్వాత వారంతా స్వస్థలంచేరి, జీవించి ఉన్నంతకాలం శ్రీహరి పాదసేవ కంకితులై అవసానదశలో సాయుజ్యముక్తిని పొందారు.

* * *

## 8. గోరా కుంభారా

**శ్లో॥ ముక్తేర్మూలం మునివరహృదానందకందం ముకుందం**
**కూటస్థాఖ్యం సకలవరదం సర్వచైతన్య రూపమ్ ।**
**నాదాతీతం కమలనిలయం నాదనాదాంత తత్త్వమ్**
**నాదాలోలం ప్రకృతి రహితం రామచంద్రం భజేఽహమ్ ॥**
**– శ్రీరామకర్ణామృతమ్ (2–44)**

పండరీపురం సమీపంలో గల ఒక చిన్నగ్రామంలో గోరాకుంభారా అనే ఒక కుమ్మరి ఉండేవాడు. అతడు కుండలుచేసి విక్రయించి జీవితాన్ని గడుపుతుండేవాడు. అతని యింట భార్య, ఒక చిన్న బిడ్డ మాత్రమే ఉన్నారు.

గోరా హృదయం చాల సుకుమారమైనది. అతడు రోజులో కొంతసేపు మాత్రమే కుండల తయారీ కోసం వినియోగించి, తక్కిన సమయమంతా శ్రవణ, మనన, ధ్యానమనన పూజాదులచే శ్రీహరిని సేవించడంలో గడిపేవాడు. అతని భార్య కూడ భర్తలాగానే సకలవిషయాలలో ఆయనను అనుసరించి నడచుకొనేది. భార్యకు తగిన భర్త, భర్తకు తగిన భార్య అని వారిని ప్రజలు ప్రశంసించేవారు.

ఇలా కాలంగడచిపోతుండగా, ఒకనాడు, గోరాకుంభారా కుండలు చేయడానికై మట్టిని తెచ్చి చక్కబరచడానికోసం నీళ్లుపోసి తొక్కడం ప్రారంభించాడు. ఆ సమయంలో ఆయన భార్య బిడ్డను తెచ్చి భర్తకు సమీపంలో గల ప్రదేశంలో కూర్చుండబెట్టి, ఏటికి నీళ్లకోసం వెళ్లింది. గోరా మట్టిని రెండుకాళ్లతో తొక్కుతూనే కొంతసేపు బిడ్డను పలకరించి, చప్పట్లతో ఆనందింపజేయసాగాడు. ఇలా ఒక పదినిమిషాలు గడచిపోయిన తర్వాత, **అతని హృదయం హఠాత్తుగా ఈశ్వర ధ్యానమగ్నమయింది. ధ్యానం మననంగా పరిణమించింది. మననం కీర్తనంగా మారింది. వెంటనే అతడు రెండు కాళ్లతో లయాత్మకంగా మట్టిని తొక్కుతూ చేతులతోనే తాళం వేస్తూ –**

భజన చేయడం ప్రారంభించాడు. దానితో లయబద్ధంగా నృత్యమారంభించాడు. తండ్రి చేతులు, కాళ్లు తిప్పుతూచేస్తున్న నృత్యం చూచి కిలకిలనవ్వుతూ చిన్న బిడ్డ అతణ్ణి సమీపించాడు. కాని, గోరాకుంభారాకు అదేమీ తెలియదు. బిడ్డ మట్టిగడ్డల్ని తాకాడు. క్రమక్రమంగా మట్టిలోనికి వచ్చాడు. చివరికి తండ్రి కాళ్లనడుమ చేరుకున్నాడు. చూస్తూండగానే కాళ్ల కిందనే పడిపోయాడు. తండ్రి నృత్య వేగంతో, ఆ బిడ్డ మట్టిలో కలిసిపోయాడు. తల మాత్రమే దొర్లసాగింది. బిడ్డ రక్తంవలన మట్టీ, తండ్రి పాదాలూ ఎఱ్ఱబడ్డాయి. బిడ్డ ఎముకలు లేతవి కావడంచేత పెళపెళ విరిగిపోయాయి. ఈ విధంగా ఆ శిశువు చూస్తూ ఉండగానే మట్టిలో కలిసిపోయాడు. అయినా గోరాకుంభారా ఇదేమీ ఎరుగడు. అతని భక్తి క్రమక్రమంగా మరింతగా పెరిగిపోయింది.

**శ్లో॥ దివివా భువివా మమాస్తు వాసో నరకేవా నరకాంతక ప్రకామమ్ ।**
**అవధీరిత శారదారవిందౌ చరణౌ తే మరణేఽపి చింతయామి ॥**
**– ముకుందమాల(శ్లో.6)**

అని అంతకంతకు మరింత మధురాలైన గీతాలను పాడుతూ నృత్యవేగాన్ని పెంచుతూపోయాడు. కొంత సేపయ్యేటప్పటికి అతనికి పాండురంగడు సన్నని వస్త్రం వెనుక తోబూచు లాడుతున్నట్లు తోచింది. ఇంకేం కావాలి! నృత్యవేగం మరింత పెరిగింది. తాళాల శబ్దాలు దిక్కుల గుహల్లో ప్రతిధ్వనింపసాగాయి. గీత ధ్వనులు మిన్నుముట్టాయి. నేత్రాలు నిమీలితాలయ్యాయి. హృదయంలో అసంతృప్తి నిండింది. ప్రాపంచిక జ్ఞానం లుప్తమైపోయింది. గోరాకుంభరా హరి భజనం తారస్థాయికి చేరుకుంటున్నది.

**తన కన్నబిడ్డ తనపాదాలకిందనేపడి నలిగిపోగా రక్తంతో తండ్రి పాదాలకు పారాణియైన హృదయవిదారక దృశ్యం**

సరిగ్గా అదే సమయంలో, గోరా భార్య నీటి కడవతో ఇంటికి వచ్చింది. నీళ్లకడవ ఇంట్లోపెట్టి, బయటికి వచ్చి, చూచింది. ఆమె ఒళ్లంతా కళ్లుచేసుకొని బిడ్డను వెదుకుతూ ఉంది. బిడ్డ ఎక్కడ? అటుచూచి, ఇటు చూచి చివరికామె చూపులు భర్త తొక్కుతున్న మట్టిమీదికి పోయాయి. జరిగిన సంఘటన. ఆమెకొక దృశ్యమాలికగా సాక్షాత్కరించింది. "అయ్యో! ఎంత కష్టం దాపురించిందిరా తండ్రీ! ఈనగాచి నక్కలపాలు చేసినట్లుగా, సిద్ధాన్నం మట్టిలో కలిసిపోయినట్లుగా, నవమాసాలు మోసి, కడుపార కన్నబిడ్డ ఒక్క క్షణంలో మట్టిలో కలసిపోయాడే! బిడ్డ తన తండ్రికాళ్లకు మొక్కుతున్నాడా అన్నట్లు దోగాడుతూ వెళ్లి, కాళ్లకింద పడినలిగి బలవన్మరణం పొందడం ఎంత దురదృష్టకరం! హృదయ విదారకం!! ఇంకేముంది? పాపం! ఆ ఇల్లాలి ప్రైప్రాణాలు పైనే పోయాయి.



కొంతసేపు ఆమె నిశ్చేష్టురాలై ఉండిపోయింది. తర్వాత ఈ లోకంలోకి వచ్చి, రొమ్ము బాదుకుంటూ, "ఆహా! నా తండ్రీ! నా ముద్దుబిడ్డా! కంటికి కనబడకుండా పోయావటయ్యా! మట్టి బతుకులయ్యామనవి! మట్టిలోనే పుట్టి, మట్టితో జీవించి, మట్టిలో కలిసిపోయే మన బతుకుల్లో సుంత గట్టితనం చూపిస్తావని కొండంత కోరికలతో ఉన్న నన్ను కాదని, మీ తండ్రి, భక్తి జనితోద్యత్తాండవానికి బలియైపోయి, ఆయన పాదాలకు నీ లేత రక్తంతో పారాణి పూశావా తండ్రీ! ఎంత గొప్ప మనసురా నీది!" అని దుఃఖం ఆపుకోలేక, "అయ్యో నాథా! ఇదేమి ఘోరం! అని బిగ్గరగా అరుస్తూ ఏడ్వసాగింది.

**తన బిడ్డకేం జరిగిందో తెలియని అమాయక భక్తుడు - "అంబుజోదర పాదారవింద చింతనామృతపానవిశేష మత్తచిత్తుడు" - గోరాకుంభారా**

భార్య రోదనధ్వని విని గోరాకుంభారా ఉలికిపడి చూచి "ఓసీ! దుర్మార్గురాలా! ఒళ్లు తెలియకుండా, ఉన్మత్తురాలివై పిశాచంలాగా అరుస్తూ, నీవు, నాముందు సాక్షాత్కరించిన పండరీనాథుని పారద్రోలినావే!" అని ఉబికి ఉబికి వస్తున్న కోపాన్ని పట్టలేక ఆగ్రహోదగ్రుడై ఆమె పైబడి

కొట్టబోయాడు. వెంటనే, ఆమె **"నన్ను ముట్టిన పాండురంగని ఆన ఉంది"** అని తటాలున వెనక్కు తగ్గింది. ఇది విన్నంతనే గోరాకుంభారా భయచకితుడై వెనక్కుతగ్గి, ఒక మూలకుపోయి కూర్చుండి, మరల నిశ్చల హృదయంతో భగవన్నామస్మరణలో మునిగిపోయాడు.

ఆ ఇల్లాలి రోదన ధ్వనులు విన్న దారినపోయే బాటసారులు వచ్చారు. తర్వాత, ఇరుగుపొరుగు వారు వచ్చారు. ఇంతలో ఈ దారుణ మరణం ఊరుఊరంతా తెలిసిపోయింది. మరుక్షణమే ఊరివారంతా విరిగి పడ్డారు. ఆ దృశ్యాన్ని చూచి కొందరు తెల్లబోయారు. కొందరు బాష్పధారలుగా దుఃఖించారు. కొందరు కుంభారా భార్యను ఊరడించారు. మరి కొందరు గోరాకుంభారకు మతిపోయిందని, చిత్తచాంచల్యం ఏర్పడిందన్నారు. ఇంకా మరికొందరు, ఆయనను ముఖంమీదనే తిట్టిపోశారు. "ఒళ్లెరుగని శివం ఉంటుందా? అన్ని నిగ్గదీశారు. అందరు అన్ని విధాల దూషించి, అసహ్యించుకున్నారు.

ఇంత జరిగినా కుంభారా భార్యవైపు కన్నెత్తి చూడలేదు. ఆమెకూడ స్తబ్ధురాలై ఉంది. కుంభారాకు అసలు ఆ సన్నివేశం జరిగినట్లే లేదు. ఆయన లోకంలో ఆయన ఉన్నారు. చాలమంది అరచి అరచి వినేవారులేక వెళ్లిపోయారు. కాసేపటికి ఏడుపు మానివేయబడింది. కుంభారా జపంమాత్రం కొనసాగుతూనే ఉంది. అతడు ప్రాపంచిక జ్ఞానం పూర్తిగా కోల్పోయాడని అందరూ తీర్మానించారు.

మరికొంతసేపు గడిచింది. వాతావరణం ప్రశాంతంగా ఉంది. కుంభారా భార్య. "నేనీ విధంగా దుఃఖిస్తూ కూర్చుంటే, ఏమిలాభం? **బ్రతికి ఉన్నంతకాలం ఏడ్చినా బిడ్డను బతికింపగలనా, ఈ సంసారం చెడిపోవడం తప్పు."** దీనివల్ల, ఇంకేమి లాభం? అని నిశ్చయించుకొని ఒక చెంబుతో నీళ్లు తీసుకొని బంకమట్టి తొక్కి తొక్కి అలసిపోయిన భర్తపాదాలను కడగటానికి



ఆయన వద్దకుపోయింది. భర్తృ సాన్నిధ్యమే ఆమెకు చాల భారవహమైనట్లు తోచింది. కుంభారా వెంటనే, **"నన్ను తాకితే పాండురంగని మీద ఆన కలదన్నాను కదా!" "కాబట్టి నన్ను తాకకు"** అని గద్దించి పలికాడు. ఆ మాట విన్న వెంటనే ఆమె అక్కడినుంచి వెళ్లిపోయింది. అతని ఉనికి భారమనిపించినా అది ఈ మాటతో తొలగిపోయింది.

## కుంభారా భార్య పుట్టింటికి వెళ్లిపోవడం

కుంభారా భార్య సరాసరి ఆమె పుట్టినింటికి వెళ్లిపోయింది. తల్లి తండ్రులామె హఠాద్దర్శనానికి ఆశ్చర్యపోయారు. "బిడ్డ ఎక్కడనే?" అని తల్లి అడగడమే తరువాయి ఆమె గుండె పగిలేటట్టు పెద్దగారోదించింది. తల్లి ఆమెను గుండెకు హత్తుకున్నది. ఏదో విషజ్వరం వచ్చి బిడ్డ హఠాత్తుగా పోయాడని చెప్పిందే తప్ప తన భర్త చేసిన ఘోరకృత్యాన్ని ఆమె తన నోటితో చెప్పలేదు. "మా వంశం నిర్వంశమయ్యేటట్లున్నదమ్మా! ఆవిధంగా జరుగకుండా, నా భర్తకు, నా చెల్లెలినిచ్చి పెండ్లి చేయండి" అని ప్రార్థించింది. తల్లితండ్రులు ఆమె ప్రార్థనను తోసి వేయలేక మహావైభవంతో తమ చిన్న కుమార్తెను గోరాకుంభారాకు ఇచ్చి ద్వితీయ వివాహం జరిపారు.

కుంభారా అత్తమామలు అందరి సమక్షంలో **"మా బిడ్డలను ఇద్దరిని సమానభావంతో చూడవలసింది. లేకున్న పాండురంగనిపై ఆన ఉంది"** అన్నారు. మరుసటిరోజు, అక్కసెల్లెండ్రు తమ భర్తతో కలిసివెళ్లారు.

## ద్వితీయ వివాహానంతరం కూడా గోరాకుంభారా మానసిక స్థితిలో మార్పులేకపోవడం

ఇంటికి వచ్చిన తర్వాత కుంభారా ప్రవర్తనలో ఎటువంటిలోపం లేకుండా ఇద్దరు భార్యల్ని మక్కువగా చూసుకుంటూ కావలసిన ఏర్పాట్లన్నీ చేయసాగాడు. అయితే వారిని అంటకుండా, వారితో సరససల్లాపాలను చేయక, హరిధ్యానతత్పరుడై ఉండినాడు. అందుకు చాల బాధపడి పెద్దభార్య

ఒకరోజు అతని దగ్గరవచ్చి, మోకరించి నిలిచి, చేతులు జోడించుకొని, స్వామీ! ఇదేమిఘోరం! మా చెల్లెలును, నేను కూడా మిమ్మల్ని అచంచల భక్తితో సేవిస్తున్నాంకదా! కాని, నా చెల్లెలివలన ఎటువంటి అపరాధం జరిగింది. ఏమీ తెలియని ఆ అమాయకురాలని మీరేల కరుణింపరు! ఇట్లయితే ఆ అన్నెంపున్నెం ఎరుగని ఆమె గతి ఏంకావాలి? అని ప్రార్థించింది.

అందుకు గోరాకుంభారా నిశ్చలంగా ఇలా సమాధానమిచ్చాడు. "భార్యామణీ! నీ తల్లితండ్రులు నీ చెల్లెలిని నాకిచ్చిననాడు సకల బంధువుల సమక్షంలో మా బిడ్డలను ఇద్దరిని సమభావంతో చూడవలెనని ప్రార్థించారుకదా! **నిన్ను ముట్టడానికి పాండురంగనిపై ఆన ఉంది కదా! కాబట్టి, వీలు లేదు. కాబట్టి నేను చేసే ఘోరమేముంది? నీ చెల్లెలిని తాకితే, నిన్ను కూడ తాకవలసి వస్తుంది. అందుచేత, ఇద్దర్ని కూడ తాకడం మానివేశాను."** అని బదులు చెప్పాడు.

అది విని ఆమె కొంతసేపు నిశ్చేష్టురాలై, చేసేది లేక, దుఃఖిస్తూ, లోపలికి వెళ్లింది. ఆ రోజురాత్రి భర్త గాఢంగా నిద్రించే వరకు ఊరకుండి, తర్వాత, అక్కచెల్లెళ్లు ఇద్దరూ యోచించుకొని అతనికి చెరి ఒకవైపున పండుకొని అతని చేతుల్ని తమ ఇద్దరిపై పెట్టుకొని పడుకున్నారు.

ఇలా పదినిమిషాలు జరిగిందో లేదో, కుంభారాకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. వెంటనే అతనికి తానున్న పరిస్థితి అవగతమైంది. తటాలున శయ్యదిగి, "అరెరే! ఈ స్త్రీలు ఎంత సాహసకృత్యానికి పూనుకున్నారు? ఎలా మోసగించడానికి తలపెట్టారు?" అని దుఃఖించి పాండురంగని పదకమలాలనుస్మరించి వెంటనే తన రెండు చేతుల్ని ఛేదించుకొన్నాడు. వెంటనే అతని భుజమూలాలనుండి రక్తధార చిమ్మన గొట్టాలనుండి ప్రసరించే విధంగా ఎగసిపడి నేలను రక్తసిక్తం చేశాయి. ఆ రక్తపాత స్పర్శవలన భార్యలిద్దరు మేల్కొని, జరిగిన దానికి ఆశ్చర్య విషాదాలకులోనై, కొంతసేపు



అవాక్కయి, చేష్టలుడిగి తర్వాత "నాథా! మీకింత కోపమెందుకు?" అని దుఃఖింపసాగారు. అపుడాతడు బాధ ఏమీ లేనివానివలె మందహాసం చేస్తూ, **"చంద్రముఖులారా! భక్త త్రాణపరాయణుడైన ముకుందుడు ఉండగా మనకేమి లోపం?"** అని వారికి ధైర్యాన్ని కల్గించి, శ్రీహరిని ఇలా ప్రార్థించినాడు.

**శ్లో॥ క్షీరసాగర తరంగశీకరాసారతారకితచారుమూర్తయే ।**
**భోగిభోగ శయనీయశాయినే మాధవాయ మధు విద్విషేనమః ।**
**– ముకుందమాల (శ్లో.39)**

అంతటి రక్తస్రావం ఉపశమించి, గోరాకుంభారా అవిటివాడేమో అన్నట్లుగా కనబడసాగాడు. **ఇది వైద్యునితో నిమిత్తం లేని భవరోగ వైద్యుని చికిత్స. ఎటువంటి విచికిత్సకు తావులేని అచంచల నిశ్చయ భక్తినిష్ఠుడు గోరాకుంభారా!**

## పండరీపుర పాండురంగని మహోత్సవాలకు గోరాకుంభారా తన ఇద్దరు భార్యలతో వెళ్లుట

కాలమిలా గడుస్తుండగా, ఆషాఢశుద్ధ ఏకాదశి వచ్చింది. ఆ రోజు పండరీపురంలో పాండురంగనికి మహోత్సవాలు జరుగుతాయి. ఆ ఉత్సవాలకు గోరాకుంభారా తన ఇద్దరు భార్యలను పిలుచుకొనిపోయి, చంద్రభాగానదిలో స్నానంచేసి ఆలయంలో ప్రవేశించి భక్తచింతామణి, దీనజన బాంధవుడు, దీనావనుడైన ఆ పాండురంగని సేవించి గుడి వెలుపలికి వచ్చాడు. ధ్వజస్తంభం దగ్గర **నామదేవుడు** మహానందంతో పాండురంగని కీర్తిస్తూ నాట్యం చేస్తున్నాడు. అతని భక్తికి మెచ్చి, అతనికి మాత్రమే కన్పిస్తూ పాండురంగడు అక్కడనే ఉన్నాడు. పదినిమిషాలలో ఆ ప్రదేశమంతా జనసంకీర్ణమైపోయింది. ఆ జనులలో గోరాకుంభారా అతని ఇద్దరు భార్యలు కూడ ఉన్నారు. ఆశ్చర్యంతో నోళ్లు తెరిచి చూస్తున్న జనసమూహాన్ని చూచి కుంభారా, "అయ్యలారా! ఏమిటి చూస్తున్నారు?

పాండురంగని కీర్తిస్తూ భజనచేయండి" అన్నాడు. వెంటనే వారు భజన ప్రారంభించారు. వారిని చూచి కుంభారా భార్యలు "అయ్యో! రెండు చేతులా, త్రికరణశుద్ధిగా భజనచేసే తమ నాథునికి రెండు చేతులూలేవే! ఎంత దుఃఖకరమైన విషయమని" బాధపడసాగారు ఆ దుఃఖంలో మునిగిపోయి వారు కళ్లు మూసుకుని నారాయణనామ సంకీర్తన వింటూ మరల కన్నులు తెరచి చూచేటప్పటికి, గోరాకుంభారా రెండు చేతులా చప్పట్లు చరుస్తూ హరినామ సంకీర్తనం చేస్తూ అందరితో కలిసి అడుగులు వేస్తూ భజనచేయడం వారి కంటబడింది. వారిద్దరు తెల్లబోయి తేరుకొని **'ఇదంతా ఈశ్వరేచ్ఛ'** అని భావించి పాండురంగని మహామహిమను కీర్తింపసాగారు.

ఇంతలో శ్రీకృష్ణుడక్కడ సాక్షాత్కరించాడు. ఆయన వెంట రుక్మిణీదేవి, కుంభారా బిడ్డను చంకబెట్టుకొని వచ్చి, ఆ బిడ్డను కుంభారుని పెద్ద భార్య కిచ్చింది. అనూహ్యమైన ఆ సన్నివేశానికి ఆశ్చర్యచకితులై, ఇకలేదనుకొన్న బిడ్డ పునర్జీవితుడై రుక్మిణీ పాండురంగనాథుల కృపచే లభించడం భగవంతుని నిర్హేతుక కృపాకటాక్షమని మహదానందం పొందారు. రుక్మిణీదేవిని మనసార స్తుతించారు.

### శ్రీకృష్ణుడు గోరాకుంభారుని నియమ నిష్ఠలకు ప్రశంసించి అనుగ్రహించుట

అప్పుడు, శ్రీకృష్ణుడు గోరాకుంభారాను సమీపించి, "భాగవతాగ్రణీ! నీ నియమనిష్ఠలకు ఆనందం. నీ భక్తి ప్రపత్తులకు సంతోషం, నీ భార్య నీవు, నాపై పెట్టిన ఆనలు నేటితో కృతార్థాలైనాయి. కాబట్టి, ఈ నాటినుండి నీయిరువురు భార్యలతో సుఖంగా సంసారాన్ని నిర్వహించుకుంటూ, మౌఢ్యపతితమైపోతున్న లోకాన్ని ఉద్ధరించు." అని ఉపదేశించి రుక్మిణీ దేవితో సహా అంతర్ధానమయ్యాడు.

గోరాకుంభారా బ్రతికి ఉన్నంతకాలమూ అనేకులను సాధుమార్గ ప్రవర్తకులనుగా చేసి, హరిభజన బృందాలను ఏర్పాటు చేశాడు. ఎన్నో



అద్భుత కార్యాలను చేసి ప్రజల్ని తనవైపు తిప్పుకొన్నాడు. కొందరికి ముక్తిమార్గోపదేశంచేసి, జన్మసాఫల్యాన్ని ప్రసాదించాడు. అతని భార్యలిద్దరు అతని వీడని నీడవలె అనుసరిస్తూ అభ్యున్నతిని పొందారు. అవసానదశలో గోరాకుంభారా, అతని భార్యలు అలవోకగా, అవలీలగా, భౌతిక దేహాన్ని విడిచి, శ్రీహరిసాయుజ్యాన్ని పొందారు.

**శ్లో॥ మునిహృత్తోషకరున్ బ్రధానరహితు న్మోక్షాధినాథున్ సనా ।
తనుఁ గూటస్థుని సర్వవిశ్వమయు జైతన్యాకృతిన్ గృత్స్నునం
దను సర్వాత్ము ముకుందు లోకవరదున్ నాదాంతతత్త్వాత్ము నీ
త్యనఘున్ రాము ధరాసుతాధిపతి నాదతీతు భావించెదన్ ॥**

**- శ్రీరామకర్ణామృతము (2-48)**

* * *

# 9. భక్త తుకారాం

తుకారాం (1608–1650) మరాఠీ భాషా సారస్వతంలో ఒక గొప్ప కవియోగి. ఇతడు శూద్రజాతికి చెందినవాడు. ఇతని తండ్రిపేరు కనకై. తల్లిపేరు బోల్‌హోబా. క్రీ.శ.1630–31లో ఏర్పడిన గొప్పకరువుకాటకాల కాలంలో తుకారాం తన ధర్మపత్ని రఖుమాబాయి, తన కుమారుని ఆకలిచావులను కళ్లారా చూచి నిస్సహాయంగా విలపించినవాడు. ఆత్మకథా రూపమైన అభంగాలలో తుకారాం ఈ హృదయవిదారక సన్నివేశాలను కరుణ రసార్ద్రంగా చిత్రీకరించారు. పర్యవసానంగా తుకారాం ఆధ్యాత్మిక చింతనలో మునిగిపోయాడు. ఆ సందర్భంలోనే నామదేవునితో కలిసి సాక్షాత్ పాండురంగని స్వప్న సాక్షాత్కారం కలిగింది. ఆ తర్వాత కొంతకాలానికి అప్పాజీ గులవే కుమార్తెయైన 'అపలాయి' ని తుకారాం వివాహమాడాడు. ఇతడు నామదేవుని అపరావతారమంటారు. శ్రీమద్రామానుజులే మణవాళ మహామునులుగా పుట్టినట్లు, నామదేవుడు ప్రారంభించిన శతకోటి అభంగాలు పూర్తికాకపోగా, తక్కిన వాటిని పాండురంగని ఆజ్ఞచే తుకారాం పూర్తిచేశారు.

ఇతనిపై జ్ఞానేశ్వరుడు (1275–1296), నామదేవుడు (1220–1350), ఏకనాథుడు (1533–1599), కబీర్‌దాస్ (1440–1518), చైతన్య మహాప్రభువు (1485–1533)ల వంటి మహానుభావుల భక్తి విచారధారా ప్రభావం ప్రసరించింది. తుకారాం పండరీపురంలో కృష్ణస్వరూపియై వెలసిన పాండురంగ విట్ఠలుని అంతరంగ ఏకాంత భక్తుడు. ఇతని అభంగాలు గాఢమైన భక్తి పారవశ్యంతో ప్రజలు ఇప్పటికీ పాడుకుంటారు. వార్కరీ పంథా లేక భాగవతపంథా భక్తి ఉద్యమంలో మహారాష్ట్రదేశంలో బహుశః భక్తితుకారాం రచనలు కొత్త పుంతలు తొక్కినవని చెప్పవచ్చు.

ఈశ్వర నియమనం వల్ల నామదేవుడే 'దేవనగరం' అనే గ్రామంలో తుకారాముడనే పేరుతో పుట్టాడు. ఇతని తల్లితండ్రులు వర్తకులు కనుక బాల్యంలోనే తుకారాంకు వర్తకం చేయడం అభ్యాసమయింది.



### తుకారాం - శివాజీ

తుకారాం ఏటేట అషాఢమాసంలో పండరీపురానికి పోయి స్వామిని సేవించుకొని రావడం పరిపాటి. ఒక సంవత్సరం పాండురంగ క్షేత్రంనుండి వచ్చి తర్వాత తుకారాం తన ఇంట్లో కూర్చుండి శ్రీహరి భజనలో నిమగ్నుడై ఉండగా, మహారాష్ట్రనేత శివాజీ మహారాజు, తుకారాంను సేవించుకోవాలనే చిరసంకల్పంతో పళ్లెంనిండా రత్నాది అనర్ఘ హారాలను కానుకలుగా నింపుకొనివచ్చి, సాష్టాంగ మాచరించి కానుకలు సమర్పించాడు. అది చూచి తుకారాం "వత్సా! నీ భక్తికి ఆనందమైంది. కాని, ఈ నగలతో నాకేమీ పనిలేదు. దీన్ని నీవే తీసికో! నీకు తీసుకోవడం ఇష్టం లేకపోతే వీటిని దీనజనుల ఉద్ధరణార్థం వినియోగించు." అని చెప్పి వెంటనే హరిభజనలో నిమగ్నుడయ్యాడు.

శివాజీ అలాగే చేయదలచి, కొంతసేపు హరి భజనానందంలో ఉండగా, శివాజీ ఒంటరిగా ఉన్నాడని తెలిసి, ఢిల్లీ చక్రవర్తి సైన్యం అతివేగంగా హుటాహుటి అక్కడికి వచ్చింది. లోపల శివాజీ ఉన్నాడు. మాకు మర్యాదగా అప్పగించకపోతే లోనున్న వారి ప్రాణాలు దక్కవని గర్జించారు. సైనికాధికారులు.

శివాజీ, తుకారాంస్వామికి ధ్యానభగ్నమౌతుందని జాగ్రత్తపడి తానే వేరొక దారిలో వెలికి వచ్చి, గుఱ్ఱాన్నెక్కి నవాబుసైన్యం ముందు నిలిచాడు. ధ్యానస్థితుడైన తుకారాం, తన మనసులో **"స్వధర్మరక్షకుడైన ఈ ప్రభువును ఈశ్వరుడు రక్షించుగాక!"** అని స్మరించి ధ్యానంలో లీనమయ్యాడు. శివాజీపరాక్రమం ముందు తురుష్కసైన్యం నిలువలేదు. వారినందరినీ మట్టుబెట్టి, శివాజీ తన దారిన తాను వెళ్లాడు.

శివాజీ మనస్సులో తీవ్రమైన అసంతృప్తి చోటుచేసికొన్నది. తుకారాం స్వామివారికి తానొక తృణమైనా కానుక సమర్పించుకోవాలని సంకల్పించాడు. ఒక వర్తకుని వేషం ధరించి. ఒక బండిమీద ధాన్యపు

బస్తాలు వేసికొని వచ్చి, స్వామీ! నేను వర్తకుణ్ణి, ఈ సంవత్సరం నాకు వర్తకంలో ఈ బండెడు ధాన్యం లాభంవచ్చింది. దానిని మీకు సమర్పిస్తున్నాను. దయచేసి స్వీకరించి నన్ను ఆశీర్వదించండి.” అన్నాడు. వచ్చిన వ్యక్తి మాటతీరు, హావభావాలను గ్రహించి తుకారాం స్వామి అతడు “శివాజీ”యే అని గ్రహించి, అర్ధనిమీలిత నేత్రాలతో ఉండగా, మౌనమే అర్ధాంగీకారమని శివాజీ, ఆ బస్తాలను తుకారాం ఇంటిలో సేవకులచే భద్రపరిపించి, ఆ ఇంటి ఇల్లాలికప్పగించి వెళ్లిపోయాడు.

తుకారాం ధ్యానస్థితినుండి లేచి, చూచి, భార్యతో మనకు ఒకపూటకు సరిపడునంత ధాన్యాన్ని మాత్రం తీసుకొని తక్కినదంతా పేదవారికి. పంచి పెట్టుదామన్నాడు. ఆయన భార్య ఈ ధాన్యమంతా మనకే ఉంటే, మన కుటుంబానికి ఒక ఏడాది పొడుగునా ఇబ్బంది లేకుండా ఉంటుంది కదా! అనుకొన్నది. ఆమె భర్తమాటను వెంటనే అమలు పరచకపోవడంతో, **“అపనా హాథ్, జగన్నాథ్”** అంటూ తుకారాం తానే పూనుకొని, ధాన్యాన్నంతా బీదసాదలకు పంచిపెట్టాడు.

## తుకారాం - గాజుల వర్తకుడు

పండరీపురంలో ఒకగాజుల వర్తకుడుండేవాడు. అతడు ప్రతిరోజు తుకారాం ఇంటికిపోయి భజనలో పాల్గొనేవాడు. ఒకరోజు అతని బిడ్డకు ప్రాణంమీదికి వచ్చింది. దాన్ని అతడు లక్ష్యపెట్టక తుకారాం ఇంటికి యథాప్రకారంగా వెళ్లాడు. ఆయన భార్య దారిలో అడ్డుతగిలి నిలుపాలని ప్రయత్నించినా వర్తకుడు తుకారాం ఇంటకే దారితీశాడు. అక్కడ తుకారాం పారవశ్యంతో హరిగుణాలను కీర్తిస్తూ నృత్యం చేస్తుంటే, వర్తకుడు కూడ తన్మయుడై నృత్యం చేయసాగాడు.

ఒక అరగంట తర్వాత తుకారాం భజన ముగించి లోకంలోకి వచ్చాడు. వర్తకునికి స్పృహ వచ్చింది. అయితే ఈలోపల వర్తకుని బిడ్డ చనిపోయాడు. అప్పుడతని భార్య చనిపోయిన బిడ్డ శవాన్ని భుజాన వేసికొని తుకారాం ఇంటికి వచ్చి ఆయన ముందు పడవేసి, ఘోరంగా దుఃఖిస్తూ, “స్వామీ!



మీకారణంగానే నాభర్త సంసారంపట్ల విముఖుడయ్యాడు. నాభర్త అశ్రద్ధవల్ల, వైద్యలోపం జరిగి నా బిడ్డ చనిపోయాడు. ఈ పాపమంతా మీదే! ఇప్పుడైనా నా భర్తను మందలించి సరైన దారికి మళ్లించమని, ప్రాధేయపడింది. అది విని ఆమె దగ్గరలో నిలబడిన భక్తులు “అమ్మా! తొందరపడకు! స్వామివారు నీ భర్తను వంచింపలేదు. అసలు నీ భర్త సంగతి స్వామివారికి తెలియదు.” అన్నారు. అప్పుడు తుకారాంస్వామి వారిని వారించి, ప్రార్థనచేస్తూ తాళంవేస్తూ నృత్యం చేస్తూ

శ్రీహరిని ప్రార్థించాడు. అందరు స్వామివారితో గొంతు కలిపారు. పది నిమిషాలు గడిచిందో లేదో వర్తకుని బిడ్డ పునర్జీవితుడయ్యాడు. అందరు ఆశ్చర్యపోయారు. వర్తకుని భార్య “అపరాధాన్ని క్షమింపవలసింది”గా తుకారాం పాదాలమీద వ్రాలింది.”

## తుకారాం స్వామి వైరాగ్యంతో అడవులకు వెళ్లిపోవడం

ఒకప్పుడు తుకారాం స్వామికి వైరాగ్యం మిన్నుముట్టగా, ఇల్లువిడిచి, అడవులలోకి వెళ్లిపోయారు. ఆయన భార్య, అనుక్షణ నిరీక్షణతో ఉదయాస్తమానాలు వేచి వేచి, ఇంట్లో వంటసరుకులు ఏమీలేకపోవడం చేత, ఆమె పిల్లల్ని పక్కఇంట్లో వదలి, సరాసరి అడవుల కేసిబయలుదేరింది. కొంతదూరం ఆ విధంగా వెళ్లగా పాండురంగని సేవించుకోవడం కోసం తుకారాం స్వామియే ఎదురుగా రావడం కనబడింది.

ఆమె ఆయనకెదురేగి, “నాథా! మీకిది తగునా? మీరు ఇల్లు విడిచిపెట్టి రెండు మాసాలైనాయి. ఎవరో ఇచ్చిన ధాన్యం దానంచేశావు. నేను పిల్లలు ఏమి తిని జీవించేది? ఆకలివల్ల మాడిపోతున్నాము. మేమేమీ భోగభాగ్యాలు కోరడంలేదు. కేవలం గంజినీళ్లు చాలు. రెండు పూటల గంజినీళ్లు మాత్రం చాలు. అది ఏర్పాటు చేయి. ఆ తర్వాత నీ శ్రీహరి భజనకు అంతరాయం ఉండదు. మేము అడ్డురాము. మేము మలమలమాడుతుంటే నీవు భగవత్ భజనం చేసి ఏం ప్రయోజనం? గొప్పజ్ఞానివైన నీకు ఈ మాత్రం ఎందుకు

తోచలేదో ఆశ్చర్యంగా ఉంది! మమ్మల్ని పూర్తిగా మరచిపోయావా, లేక వదలివేశావా?" అని నిగ్గదీసింది.

తుకారాం సిగ్గుతో తలవంచుకొని, "వనితా! ఎందుకు నిష్ఠురాలు పలుకుతావు? సంసారంలో ఉండేవాడికి నీవు చెప్పిందంతా నిజం. కాని, నాకు అదేమీ తెలియదు. నీకు పాండురంగని పాదపద్మాలపై స్థిరభక్తిలేదు. కాబట్టి, నీ తోడి సాహచర్యానికి నామనస్సు అంగీకరించడం లేదు. ఇప్పుడైనా పాండురంగనినే నమ్మి ఉంటానని, మాట ఇస్తే, నేను ఇంటికి వస్తాను" అని పలికాడు. దానికామె 'అలాగే' ఉంటానన్నది. తుకారాం ఆమెతో ఇంటికి వెళ్లాడు.

## తుకారాం తన భార్యకు మంత్రోపదేశం చేయడం

వారంరోజులు గడిచేటప్పటికి ఏకాదశి వచ్చింది. ఆరోజు తుకారాం తన భార్యకు మంత్రోపదేశం చేశాడు. ఆ ఉపదేశం వలన ఆమె జగన్మిథ్యాత్వాన్ని, సంసార అసారతను తెలుసుకొని, ఇంటిలో ఉన్న అన్ని వస్తువుల్ని దీనులకు పంచిపెట్టింది. పెరట్లో ఒక్క చీరమాత్రం మిగిలిపోయింది. అది పెరట్లో ఉన్న సంగతే ఆమెకు జ్ఞాపకం లేదు. లేకుంటే అదికూడ దానంచేసి ఉండేది. తుకారాం ఇది చూచాడు. ఆ చీర ఎవరికైనా దానం చేయాలని దాన్ని తెస్తూ ఉండగా వీధి గుమ్మం దగ్గరకు వచ్చేటప్పటికి రుక్మిణీదేవి బీదరాలి వేషంతో వచ్చి దాన్ని తీసుకొని వెళ్లింది.

రెండు రోజులు గడిచేటప్పటికి తుకారాం భార్యకు ఏర్పడిన వైరాగ్యం నిలువలేదు. బిడ్డలు ఆకలికి తాళలేక మలమలమాడుతూ ఉండటం చూసి ఆ తల్లి కడుపు తరుక్కుపోయింది. అప్పుడామె, "ఎవరిని స్మరించడం వలన తన కన్నబిడ్డలు విపత్సముద్రంలో ముంచివేసేటంతటి వైరాగ్యం కల్గిందో ఆ పాండురంగని పాదాలు నలుగగొట్టివస్తానని ఒక నల్లరాయిని పట్టుకొని గుడికి బయలుదేరింది. దాన్ని చూచి తుకారాం, భయపడి చింతాక్రాంతుడై ఆమె వెంటనే వారించడానికి బయలుదేరాడు.



## పాండురంగని పాదాలు నలుగగొట్టడానికి తుకారాం భార్య బయలుదేరడం

ఈ సన్నివేశాన్ని చూచి పాండురంగడు గడగడ లాడసాగాడు. అప్పుడు రుక్మిణీదేవి 'భయపడకండి' అని భర్తను ఆశ్వాసించి, భక్తురాలు గర్భాలయం ప్రవేశించినంతనే తలుపులు బిగించి, ఆమెను తన దగ్గరకు పిలుచుకొనింది. అది చూచి తుకారాం, "ఔరౌరా! ఆనాడు త్రేతాయుగంలో రాముడు తన మీద చాలా శత్రుత్వం వహించిన రావణుని వెంటనే వైకుంఠానికి తీసుకొనిపోయినట్లే, తన భర్త పాదాలను నలుగగొట్టదలచిన నా భార్యను రుక్మిణి చెంతకు చేర్చి ఆదరించింది. భక్తిలో తీవ్రత్వం కోపంగా పరిణమించినప్పుడు ఆ విరోధభావావేశానికి ఈశ్వరుడెలా స్పందిస్తాడో, తన ధర్మపత్నివలన తుకారాంకు తెలిసివచ్చింది. ఇంతలో రుక్మిణీదేవి భక్తురాలికి వెలగల చీరను గట్టనిచ్చి, అమూల్యాభరణాలతో అలంకరించి ఒడినిండా వరాలను పోసి తలుపులు తెరచి ఇంటికి పంపివేసింది.

తుకారాం స్వామి మహాలక్ష్మిలాగా నవరత్నాభరణాలతో వెలుగుతూ, తేజస్సు వెదజల్లుతూ వచ్చిన తన భార్యను చూచి చాల సంకటపడుతూ, "రమణీ! ఎంత పని చేశావు? మరల వ్యామోహంలో తగులుకొన్నావు గదా! నాకిచ్చిన మాటను పొల్లుచేశావు కదా! కటకటా! అఖండ సచ్చిదానందాన్ని కోరవలసిన నీవు లోకజననియైన రుక్మిణీదేవి నిన్ను పరీక్షించడానికే ఇలా చేసింది. కాబట్టి, వెంటనే ఈ ధనకనకాలను దీనులకు పంచిపెట్టి, రుక్మిణికి ఆనందాన్ని కల్గించమన్నాడు.

ఈ మాటలు విన్న వెంటనే తుకారాం ధర్మపత్నికి అఖండ వైరాగ్యం కల్గింది. ఇదంతా అజ్ఞానులు చేసేపని. తాను పొరపాటుపడ్డానని చింతించి, భర్త ఆజ్ఞప్రకారం, వెంటనే రుక్మిణి ఇచ్చినదంతా దీనజనులకు పంచియిచ్చింది. అది చూచి తుకారాం స్వామి చాల ఆనందించాడు.

## గణపత్యుపాసకుని గర్వభంగం

దేవనగరానికి సమీపంలోగల ఒక జనపదంలో ఒక బ్రాహ్మణుడుండే వాడు. అతడొక గణపత్యుపాసకుడు. అదేగ్రామంలో ఉన్న తుకారాముడు. శూద్రుడు, వేదాలకు అనధికారి. ఆతనితో పాండురంగడు సహపంక్తిని భుజిస్తాడట! ఇదెంతవరకు నిజమో పరీక్షించాలనే సంకల్పం కలిగింది. ఆ ఉపాసకునికి,

వారంతా ఇలా ఆలోచిస్తుండగా, తుకారాముడు దైవప్రేరితుడై ఆ గ్రామానికి పోయాడు. ఆడబోయిన తీర్థం ఎదురైంది. దానికి ఆనందిస్తూ, ఆ గణపతి ఉపాసకుడు తుకారాముని ఆదరంతో తన ఇంటికి పిలుచుకొనిపోయి, ఆరోజు భోజనం తన ఇంట్లో చేయాలని ప్రార్థించాడు. తుకారాముడు కూడ దానికి అంగీకరించాడు.

బ్రాహ్మణులు చేయవలసిన పూజాదికాలన్నీ ముగిశాయి. ఆ తర్వాత తుకారాముడు శూద్రుడు కనుక స్నానానికి వెళ్లిరమ్మని చెప్పారు. పూజలో అతడు పాల్గొనలేదనేది స్పష్టం. తుకారాం స్నానంచేసి వచ్చాడు. అతడు బ్రాహ్మణుల మనోభావాన్ని పసికట్టాడుగనుక, "ద్విజశ్రేష్ఠా! నాకు వడ్డించిన చోట రెండవ ఆకువేసి దానిలో కూడా వడ్డించాలి. ఎందుకంటే, నాతో కూడ భుజించడానికి పాండురంగడు వస్తాడు. అలాగే, మీరు కూడా నా యెదురుగా ఉండే ఆకులో వడ్డించుకొనండి. మీరు అర్చించే గణపతిని కూడ ఆహ్వానించి వారికి రెండవ ఆకులో వడ్డింపు చేయించండి." అన్నాడు.

ఆ రోజు విందు భోజనానికి వచ్చిన బ్రాహ్మణులందరు ఈ సంగతి విని ఆశ్చర్యపడ్డారు. తాముకూడ తుకారామునికి ఎదుటనే ఉన్న పంక్తుల్లో భోజనానికి కూర్చున్నారు. పాండురంగడే సహపంక్తిలో భుజించేటప్పుడు "శూద్ర పంక్తి భోజన" మనే దోషం మనకెలా సంక్రమిస్తుంది? అనుకున్నారు.

భోజనానికి ముందు ధ్యానాదికాలయ్యాయి. తుకారాముడు గణపతి ఉపాసకుని చూచి "అయ్యా! ఇంక ఆలస్యం దేనికి? బ్రాహ్మణులందరికీ భోజనవేళయింది. త్వరగా మీ ఉపాసక దేవత గణపతిని పిలువండి." అన్నాడు. అందుకా ఉపాసకుడు **"అయ్యా! నాతోగూడ గణపతి ఎప్పుడూ భుజించి యుండలేదు. నేను ఆ దేవుని ఇక్కడికి రప్పింపగలనని చెప్పజాలను. గణపతిని, పాండురంగని మీరే రప్పించండి"** అని బదులు పలికాడు.



బ్రాహ్మణులనుండి ఆ మాటకోసమే ఎదురు చూస్తున్న తుకారాముడు అనంత భక్తితో గణపతిని ప్రార్థించాడు. ఆయన ప్రత్యక్షమయ్యాడు. తుకారాముడు సాష్టాంగదండ ప్రణామంచేయగా గణపతి తుకారాముని ఆదరంతో లేవనెత్తి కూర్చుండ బెట్టాడు.

ఆ తర్వాత తుకారాముడు పాండురంగని స్మరించాడు. పిలిస్తే పలికే ఆ దేవుడు వెంటనే ప్రత్యక్షమయ్యాడు. తుకారాముడు స్వామి పాదాలకు సాష్టాంగ నమస్కారం చేశాడు. పాండురంగడు అత్యంత ప్రీతుడై తుకారాముని ఆదరించాడు.

ఇదంతా పరమాశ్చర్యచకితులై చూస్తున్న బ్రాహ్మణులు తెలివి తెచ్చుకొని గణపతికిని, పాండురంగనికి సాష్టాంగ వందనాలు ఆచరించి అపరాధాలను క్షమింపవలసింది'గా అనేక విధాల ప్రార్థించారు. అభయాన్ని పొందారు. అందరు కలసి భుజించారు. భోజనానంతరం గణపత్యుపాసకుడు గణపతికి, పాండురంగనికి, తుకారామునికి తక్కిన బ్రాహ్మణులకు చందన తాంబూలాది సత్కార్యాలు చేసి పూజించాడు. సంతుష్టులైన గణపతి, పాండురంగలు తిరోహితులయ్యారు. బ్రాహ్మణులందరు తుకారాముని వద్ద జ్ఞానబోధ పొందారు.

## ఏకాదశీ రోజు జ్వరగ్రస్తుడైన తుకారాంను రుక్మిణీ సహితుడై పాండురంగడు దర్శన మనుగ్రహించడం

ఒక సంవత్సరం ఏకాదశీవ్రతంరోజు పాండురంగ క్షేత్రానికిపోయి అక్కడ వ్రతానుష్ఠానం చేయాలని సంకల్పించిన తుకారాంస్వామికి హఠాత్తుగా

ఉద్ధృతమైన జ్వరం వచ్చింది. దానికి తుకారాం ఎంతో దుఃఖించి "పాండురంగా! నీ ఆజ్ఞ ఇట్లున్నది. అయినా నేనేమి చేయగలను? చరాచర ప్రపంచమంతా నీ ఇచ్ఛామాత్రమున ప్రవర్తిస్తూ ఉంది. దేన్ని ఎలా నిర్వహించాలో మీకు తెలిసినట్లుగా ఎవరికి తెలుసు? స్వామీ! నీ చెంతనుండి ప్రత్యుత్తరం వచ్చేంతవరకు నేను లేవలేను'' అని ఒక జాబువ్రాసి పండరీపురానికి పోయే యాత్రికులకు ఇచ్చి, 'ఇది విఠలనాథునికి సమర్పించండి' అని వారిని వేడుకొన్నాడు. వారు యుక్త సమయంలోనే ఆ పని నెరవేర్చారు.

అప్పుడు పాండురంగడు రుక్మిణీదేవిని చూచి, "దేవీ! తుకారాముని జాబు విన్నప్పటినుండి నాకు చాల సంతాపంగా ఉంది. మనసు మనసులోలేదు. ఇక్కడ ఎందరో వేల భక్తులు వచ్చి సేవలు చేస్తున్నారు. వీరిని విడిచి దేవనగరానికి పోవడం ధర్మంకాదు. అయినా తుకారాముని చూడకుండా ఉండజాలను. దీనికో ఉపాయం చెప్పవా!" అని అనునయంగా అడిగాడు దానికి రుక్మిణి; "నాథా! నీకు నీ భక్తులపట్లగల ప్రేమాదరాలు లోక ప్రసిద్ధం కదా! నీవు ఇప్పుడు ఇక్కడనుండి కదలడం ధర్మంకాదు. కాబట్టి, గరుడుని పంపి తుకారామునే ఇక్కడికి రప్పించు" మన్నది ఆమె.

పాండురంగడు రుక్మిణీదేవి సలహాకెంతో ఆనందించి, "వత్సా! నీ వియోగం నాకు హృదయశల్యంగా ఉంది. నీ నిమిత్తం గరుడుని పంపుతున్నాను. అతని మూపున ఎక్కి వెంటనే రావలసింది, ఇచ్చట క్షణం ఒక మహాయుగం లాగా ఉంది." అని జాబువ్రాసి పంపాడు. ఆ ఉత్తరాన్ని అందుకొని, గరుడుని చూచి, తుకారాం ఆనందభరితుడై "మహాత్మా! నీ దర్శనం అనన్య దుర్లభం. నీ అనుగ్రహానికి కృతార్థుణ్ణి. నీవు శ్రీహరి వాహనానివి. శ్రీహరి అధిష్ఠించిన నిన్ను నేనెట్లు అధిష్ఠించగలను? అని సున్నితంగా తిరస్కరించాడు. గరుడుడు పోయి ఆ సంగతి పాండురంగనికి తెలిపాడు. దానిమీద ఏమీపాలుపోక, పాండురంగడు మరునాడు



రుక్మిణీసహితుడై దేవనగరానికి పోయి తుకారామునికి దర్శనసేవ ననుగ్రహించాడు.

పాండురంగడు "వత్సా! నీ భక్తి అచంచలం. నీ అర్చనానికి ఆనందమైంది. ఏదేని వరం అడుగు" అన్నాడు. దానిని తుకారాం, "శ్రీహరీ! ఆర్తత్రాణ పరాయణా! విశ్వరూపుడవు, విశ్వేశ్వరుడవు అయిన నీవు ప్రేమతో సేవ ప్రసాదించావు. ప్రపంచంలో మానవునకింతకంటె కోరదగిన వరం మరేమి ఉంటుంది. నీవు అనుగ్రహిస్తున్నందుచేత ఈ వరం ప్రసాదించు. **సర్వకాల సర్వావస్థల యందును నా హృదయంలో నీకంటె ఇతరమైనవి తోచకుండ ఉండేట్లు, నీ పట్ల నా అచంచలభక్తి తఱిగిపోకుండ ఉండేటట్లు కోరినపుడెల్ల నీ సేవ అనుగ్రహించాలి" అని కోరాడు.** ఇలా, తుకారాం యొక్క పరమవైరాగ్యానికి పాండురంగడు ఆనందించాడు.

## పండరినాథుడు తుకారాం ఇంటిలో ఎండిన రొట్టెముక్క తిని అది అమృతకంటే మధురమని అదే భక్తిరసామృతమని చెప్పడం

"వత్సా! తుకారాం! నాకు ఆకలి అవుతోంది. తినడానికి ఏదైనా పెట్టు." అన్నాడు. పండరి ప్రభువు. ఇంటనున్న రొట్టెముక్క తెచ్చి యిచ్చి, ఇది తప్ప మా ఇంట్లో వేరొకటి లేదు." 'క్షమించవలసిందని వేడుకొన్నాడు' అన్నాడు తుకారాం. పాండురంగడు సంతోషంతో ఆ రొట్టెముక్కను తిని "వత్సా! నీవు సందేహించవద్దు. ఇంతకంటే నాకింకేమి కావాలి? నీ భక్తి రసామృతం సోకడం వలన ఇది అమృతంకంటె మధురంగా ఉంది. నాకు ఆనందమైంది. నీవు కోరినప్పుడంతా సేవ అనుగ్రహిస్తానన్నాడు.

ఈ విధంగా భక్తతుకారాం అచ్ఛము, స్వచ్ఛమైన భక్తితత్త్వాన్ని అభంగాలద్వారా వ్యాప్తి చేయించాడు. తాను ముక్తి లోకాన్ని చూరగొన్నాడు.

* * *

# 10. 'సమర్థ్' రామదాస్

## (క్రీ.శ. 1608 –1681)

'సమర్థ్' రామదాస్, సంత్ తుకారాంకు సమకాలికుడు రామదాస్ ఒక విలక్షణ, విశిష్ట వ్యక్తిత్వంగల యోగిపుంగవుడు. ఇతడు ఎనిమిదవయేటనే అధ్యయనంలోను, సన్న్యాసవ్రత దీక్షలోను పరివ్రాజకుడుగా తీర్థయాత్రలలోను కాలాన్ని సద్వినియోగంచేశారు. ఆయన ఆలోచనామార్గం (School of Thought)లో ఒక ప్రత్యేక పంథాకు చెందిన సంస్థను స్థాపించాడు. ఈ సంస్థకు మార్గదర్శకం శ్రీరామచంద్రునిపట్ల హనుమదారాధన, దాస్యభక్తిని ప్రచారం చేయడమే లక్ష్యంగాగలది. అందుకే ఆయన ప్రవచన గ్రంథానికి **'దాసబోధ'** అనే పేరు ఏర్పడింది. దాసబోధ రెండు తత్త్వాల సమాహారం

1. దేశభక్తి – భౌతిక జీవితంలో స్వాతంత్ర్యం – అభ్యుదయ పరంపరాభివృద్ధి.
2. దాస్యభక్తి – శ్రీరాముని పట్ల హనుమంతునివలె దాస్యభక్తిచే జీవన్ముక్తి.

### రామదాసు బోధనలు

రామదాసు బోధనల్లో అత్యంత ప్రముఖం, కీలకమైన అంశం ఇహానికి – పరానికీ మానవజీవిత కాలంలోనే సమన్వయాన్ని సాధించడం. ప్రాపంచిక విలువలకు – పారమార్థిక చింతనకు చక్కని ముడివేసి ప్రేముడితో జీవితాన్ని సుఖమయం చేసుకోవడమే పరమార్థం! ఆయన దృష్టిలో మంచి అవగాహనతో కూడిన మానవ ప్రయత్నంతో జాగరూకతతో ఈ ప్రాపంచిక వ్యవహారాల్లో దిగి కృషిచేయాలి. అదే సమయంలో మరో ప్రక్క జీవిత గమ్యస్థానాన్ని సాధించే ఆధ్యాత్మికచింతనతో తనను తాను ఉద్ధరించుకోవడంతోబాటు, సమకాలీన సమాజాన్ని కూడ ఉద్ధరించడం (Both inner and outer elevations at a time) దీనికై మఠాలను



స్థాపించాడు. అంతేకాదు, ఈ ఆలోచన సరళిని అందరిని అందుబాటులోకి తేవడానికి, సంస్థాగత శిక్షణ ద్వారా యువకుల్ని దారిలోపెట్టి లౌకిక కార్యాచరణ ప్రణాళిక ద్వారా, వారిని ప్రేరేపించి దేశభక్తులుగా చేయడం. వీరే కాలక్రమేణ ఆధ్యాత్మిక భావబీజాలను దేశంలో వెదజల్లుతారు.

### దాసబోధ్

దాసబోధ్, సమర్థరామదాసు ప్రధానరచన (Magnum Opus) దాసబోధ 7751 'ఓవీ' వృత్తాలతో వ్రాయబడిన గ్రంథం.

1. 'పరమాత్ముని' గురించిన **జ్ఞానబోధ**తో పాటుగా,
2. ప్రపంచాన్ని గురించిన **లోకజ్ఞానబోధ** కూడ ఉంటుంది.

ఇది రెండు పరస్పర భిన్నములైన తత్త్వసమాహార సమన్వయ సంపుటి. ఆ తత్త్వాలేవి అంటే – **లౌకిక, అలౌకికాలు, ఇహ, పరాలు, జ్ఞాన, విజ్ఞానాలు, ప్రత్యక్ష, అప్రత్యక్షాలు, అభ్యుదయ, నిశ్శ్రేయసాలు, స్వర్గ – మర్త్యాలకు సమన్వయ భూమిక!**

### "కరుణాష్టకమ్"

ఇది ఎనిమిది శ్లోకాల రచన. ఇందులో రామదాసు తన గాఢభక్తి భావనలోని తీవ్రత్వాన్ని అభివ్యక్తీకరించారు.

**"ఆస్మానీ సుల్తానీ", "పరాచక్ర నిరూపణమ్"** వంటి గ్రంథాల్లో రామదాసు సమకాలీన సామాజిక జీవిత చిత్రీకరణ చేశారు. రామదాసురచనలు చాలవరకు వచన రచనకు దగ్గరగా ఉంటాయి తప్ప ఆలంకారిక, ప్రాబంధిక శైలుల్లో ఉండవు. ఈ ఒక్క గుణమే చాలు. ఆయన రచనలు ప్రచార సాధనాలుగా బహుళ ప్రజానీకంలో చొచ్చుకునిపోయాయి.

### సమర్థ్ రామదాస్ - ఛత్రపతి శివాజీ

శివాజీకి తొలిగురువు ఆయన తల్లి జిజియాబాయి అయితే 'సమర్థ్' రామదాసు ఛత్రపతి శివాజీకి ఆధ్యాత్మిక గురువు. ఆయన 'శివాజీ'ని

హిందూసామ్రాజ్య నిర్మాతగానే కాక, ఒక ఆధ్యాత్మిక ధీరునిగా తీర్చిదిద్దినవాడు, యుద్ధరంగంలో వీరుడు, ఆధ్యాత్మికంగా ధీరుడు శివాజి ఇలా, బాహ్యాభ్యంతరాలలో శివాజీ వ్యక్తిత్వాన్ని రూపుకట్టించిన గొప్పయోగి సమర్థ్ రామదాస్. రామదాసు శివాజీకి చేసిన ఇహపర సాధకమైన బోధలు గడియారం వేంకట శేషశాస్త్రిగారు వ్రాసిన **'శివభారతము'** అనే మహాకావ్యంలో విపులంగా వివరించారు. ఇది ఒక మానవీయ, ఆధ్యాత్మిక సమన్వయ రాజనీతి! 'దాసబోధ్' ను తెలుగువచనంలో యథాతథంగా అనువదించినవారు శ్రీ కొణకంచి చక్రధరరావుగారు, ప్రథమముద్రణ 1940, ద్వితీయముద్రణ, 2006. రామదాసు బోధనలు ఇహ – పరసాధన సామర్థ్యం గలవి కాబట్టి ఆయనను శివాజీ మహారాజు "సమర్థ్" రామదాస్ అని పిలిచారు.

* * *